## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016405

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# రాఘవవేంకటేశ్వరశతకం

ఇది

శ్రీమత్తిరుమల రాఘవాచార్యకవి

చే

ఘంటసాల పూర్ణయ్యచేఁ

ప్రకటింపఁబడెను.

 [ వెల 0—6—0.

# రాఘవవేంకటేశ్వరశతకము.

శ్రీమీఱఁ దిరుపతిక్షేత్రమందు వసించి
మూఁడులోకము లేలు మొదటివేల్ప !
అజ రుద్రులనుగూడ గజగజలాడించు
దేదీప్యమాన మూర్తిప్రభావ !
'పాహి మా' మని వేఁడు ప్రజలఁ బ్రోవఁగ ధాత్రి
నవతరించిన స్వయంవ్యక్తరూప !
నీకు సోదరమూర్తి నీవయై ద్వారకా
తిరుపతిఁ బాలించు పరమపురుష !
గీ. తండ్రులకుఁ దండ్రి ! వైకుంఠధామ ! నిన్ను
బొగడఁ బూనితి నాపూర్వపూజవలన;
నిహపరము లిచ్చి మముఁ గావు మిందిరేశ !
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 1

సీ. అర్ధనారీశ్వరుం డనెడి రూపముతోడ
నెవ్వాఁడు తుహినాద్రి నివ్వటిల్లు
నలుమోములను వేదనాదముల్ జనుదేర
వాణి యెవ్వానిజిహ్వను నటించు
నింగిఁ బొంగి చెలంగు నీర్వామి నెవ్వాఁడు
కుప్పిగంతున దాఁట నొప్పినాఁడు
కొమరుసామికిఁ జోడు గూడి గుబ్బలికన్నె
కెవ్వఁ డవ్వలిచంక కెక్కియాడు
గీ. నట్టి శివ ధాతృ హనుమద్గజాననులను
శుభము లొడఁగూడ నెంతయు నభినుతించి
సంతతంబును నీపాదచింత సేతు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 2

సీ. అణిమాది సకలకళ్యాణపూర్ణగుణాయ !
యరిమర్దనాయ ! జనార్దనాయ !
సిద్ధసంకల్పాయ ! శ్రితపాలనానల్ప
కల్పకాయ ! భుజంగతల్పకాయ !
సానందరూపాయ ! హారికౌస్తుభరత్న
భూషణాయ ! మునీంద్రతోషణాయ !
లక్ష్మీకళత్రాయ ! లావణ్యగాత్రాయ !
శంఖచక్రగదాయ ! శాశ్వతాయ !
గీ. నారసింహాది దివ్యావతార దశక !
విస్ఫుటీకృతసగుణాయ ! వివిధలోక
పట్టభద్రాత్మకాయ ! తుభ్యం నమోఽస్తు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 3

సీ. తిరుమలాన్వయరత్నదీపమై తగు దేశి
కాచార్యవరుఁడు నాయనఁగుఁదండ్రి;
అనసూయకును సాటి యన నొప్పు రంగాంబ
కారుణ్యనిధి నన్నుఁ గన్నతల్లి;
అర్ధాంగి యనుమాట సార్థకంబుగ నొప్పు
చూడామణి మదీయశోభనాంగి;
తిరుపతివేంకటేశ్వరుని పేరిఁట బుట్టి
శ్రీనివాసుఁడు ముద్దుసేయుకొడుకు;
గీ. తమ్ముఁ డొకఁడు సీతారామధన్యమూర్తి;
నన్నుఁ బెంచిన మాయక్క నరసమాంబ;
రాఘవాచార్యనామవిభ్రాజితుండ;
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 4

సీ. చదివి నిద్దురవోవఁ జలివేళ నడురేయి
మేల్బనారసుశాటి మేనఁ గప్పె
శిష్యవాత్సల్యంబు చిగిరింపఁ దనవ్రేలఁ
బొలుపొంద నాకించెఁ బుట్టతేనె
మామకాంతేవాసిమణిహారమున కీవె
మేరుపూస వటంచు మిగులఁ బొగడె
వైద్యంబునకుఁ దోడు వరుస సంస్కృతభాష
నూగుమీసమునాఁడె నూరిపోసె
గీ. నతఁడు చేవలివంశశుభ్రాంశుమూర్తి
గురుఁడు మాకు సుబ్రహ్మణ్యకోవిదుండు
జలజభవు సాటి యారుశాస్త్రముల మేటి
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 5

సీ. ధరణి సుమామహేశ్వరము పేరిటి యగ్ర
హారంబు మాకుఁ బూర్వార్జితంబు
పదునాలుగేండ్లు లేఁ బరువంబు గలనాఁడె
కవితాలతాంగి నాకరముఁ బట్టె
పదునెన్మిదవయేఁడు మొదలువెట్టకమున్నె
సంతరించితి భీష్మసంభవంబు
పందొమ్మిదవయేటఁ బార్వతీవల్లభ
శతక మల్లితి నిందుకుతుక మెసఁగ
గీ. నిప్పు డిర్వదిరెండవయేఁడు సారగ
తాలు కరుగంగ శేషువు లాలకింపఁ
బలికెదను నీకు శతక ముపాయనముగ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 6

సీ. ఏలీల సాధ్వియై యొసఁగె నీవిటి యంచుఁ
బల్లవాళికి గుండె ఝల్లు మనఁగ
నేనాఁడు సుగుణుఁడై యొసఁగె మద్విభుఁ డంచు
నిందీవరాక్షు లానందపడఁగ
నేనాఁడు సుమతియై యొసఁగె నీఖలుఁ డంచు
గ్రామవాసులు దొడ్డప్రేమఁ బొగడ
నేలీల దాతృత్వ మితని కబ్బె నటంచు
నర్థార్థిసంఘంబు లాశ్రయింప
గీ. గడుసుఁదనమున మంత్రి యుగంధరునకు
సాటి యైనారు వెట్టివిస్సన్న లనఁగ
శతకము రచింతుఁ గవుల కీర్తి వహించి
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 7

సీ. అలకృష్ణదేవరాయాస్థానసుకవి ధూ
ర్జటి రచింపఁగలేదె శతక మొకటి
పండితరాయ లుద్దండపండితమౌళి
శతకంబు నుడువఁడే సంస్కృతమున
కుక్కుటేశునిమీఁద గూర్పఁడే శతకంబు
నల కూచిమంచి తిమ్మయ్యసుకవి
ఉపమానములకుప్ప లొప్పార భాస్కర
శతక మొక్కకవీంద్రుఁ డతుకలేదె
గీ. యుద్యమించెద ననవద్య హృద్యపద్య
రత్నమాలిక గూర్పంగ నూత్నగతుల
దీని ధరియించి ననుఁ గావు దేవదేవ !
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 8

సీ. గుడ్డులోపలిపిల్ల కుదురుగా వర్ధిల్ల
నెవనికారుణ్యంబు హేతు వయ్యె
నతితీవ్రగతి విహాయసవీథిఁ జనుపక్షి
యవనిప్రాపును నమ్మి మెలఁగుచుండు
కృప యెవ్వనిది మూల మపరసంశ్రయహీన
దీనమానవపరిత్రాణమునకు
కర్మబంధధ్వాంతఖద్యోతఘృణిజాత
మెవనిపాదధ్యాన మెల్లజనుల

గీ. కట్టి దేవాదిదేవ ! దివ్యప్రభావ !
ఆదిమధ్యాంతశూన్య ! లోకైకమాన్య !
నిన్ను నమ్మితి నన్ను మన్నించి గావు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !

సీ. దుర్మార్గులకె గాని ధర్మాత్ములకు లేదు
భూతలంబున రాజపూజ నేఁడు
వజ్రశుంఠలపేరు వన్నెకెక్కెను గాని
విద్వాంసులకు లేదు విలువ నేఁడు
హీనవృత్తుల ద్రవ్య మిల్లునిండును గాని
సద్వృత్తిచేఁ బొట్ట జరుఁగదయ్యె
కల్లడీంద్రను లోకమెల్ల నమ్మునుగాని
సత్యవంతులమాట సాగ దిపుడు

గీ. సకలదారిద్ర్యములవంట శనికి జంట
కలియుగమువంటి దుష్కాల మిలను గలదె
ధర్మ మెన్నఁడు నిలిపెదో దైవతిలక !
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !

సీ. హీనసేవకవృత్తి యిష్టమయ్యెనుగదా
 ప్రజలఁ బాలనసేయు పార్థివులకు
నుత్పలాక్షులఱంకు లుడపనేరఁడుగదా
 చండశాసనుఁడైన చక్రవర్తి
పెండ్లిపై పెండ్లిండ్లు పెక్కు లొప్పెనుగదా
 బాయనివిప్రజాతి కిపుడు
బక్కరండలనోళ్ళు నొక్కనేరఁడుగదా
 బహుకళానిధియైన పండితుండు
గీ. కానిపనులకు ననుకూలకాలమయ్యె
సత్యధర్మాత్ములకు వచ్చె చచ్చె చావు
కలిని నాజీవితం బెట్లు గడుపువాఁడ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 11

సీ. అన్నదమ్ములలోన నైకమత్యము లేదు
 త్రాగుఁబోతులసంఖ్య తఱుగలేదు
ప్రాణేశులకు మ్రొక్కు పంకజాక్షులు లేరు
 పితరుల మన్నించుసుతులు లేరు
గురులకొంపలు దీయఁ గొంకు శిష్యులు లేరు
 చుట్టాలు కనులారఁ జూడలేరు
దేవళంబుల కేగు దైవభక్తులు లేరు
 కల్లలాడనివారు కానరారు
గీ. కలియుగవిషానలజ్వాల గడలుకొనియె
ధర్మదేవత నాల్గుపాదములు విఱిగె
నకట ! యిప్పుడె తలక్రిందు లయ్యె జగము
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 12

సీ. జారచోరుల దురాచారముల్ మితిమీఱె
పాడిపంటలచవి పలుచఁబాఱె
బూతుపురాణముల్ పుడమివేల్పుల కబ్బె
కలిమిలిబ్బులతీవ ఖలుల కబ్బె
తగుగృహస్థులయిండ్ల దాతృత్వము నశించె
వేదముల్ చెవులకు వెగటుదోఁచె
ధనముపై పేరాస ధనవంతులకుఁ గల్గె
బ్రహ్మహత్యలు వీటఁ బ్రబలమయ్యెఁ
గీ. గన వినఁగ సేయఁగారానికార్యములను
జేయుచున్నారు; చేసిరి; సేయఁగలరు;
కాలగతి మార్ప మావంటికవుల తరమె ?
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !	13

సీ. కోరి మాలల నంటుకొను బాపనయ్యలు
పేదకొంపలుగాల్చు పృథివిపతులు
వేదనిందలుసేయు వెఱ్ఱిపుల్లయ్యలు
కుక్కపిల్లల ముద్దుగొనెడి ద్విజులు
సానినేస్తముసేయు సంసారమదవతుల్
తెలిసి దేవునిసొమ్ముఁ దినెడి జనులు
గురులపై కాల్ద్రివ్వు కుక్కలకొడుకులు
కోరి నమ్మిన గొంతుఁగోయు ఖలులు
గీ. గానవచ్చిరి పెక్కండ్రు కలియుగమున
మగలకును అంకుమగలైరి మంకుటాండ్రు
కలిమహారాజునకు 'వెఱ్ఱితలలు' మొలచె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !	14

సీ. షంగనామములేని భాగవతోత్తముల్
పుస్తె లావల ద్రోయు పువ్వుఁబోండ్లు
వెలయాండ్రతోఁగూడ వేంచేయు హరిదాసు
లక్షరంబులురాని యయ్యవార్లు
నంగీలతో భోన మారగించు నియోగు
లెంగి లన్నము బెట్టు నిందుముఖులు
ముట్టుకట్టల నాచు పురుషావతంసులు
వలపింపనేరని వారసతులు
గీ. వెలయ జన్నిదమే లేని విప్రసుతులు
నవతరించిరి యేబ్రాసు లన్ని దెసల
నేమి చెప్పుదుఁ గలికాల మిట్టులుండె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 15

సీ. కోటీశ్వరునిభార్య గొల్లభామవిధానఁ
బాలు మజ్జిగ లమ్మఁ బాడియగునె ?
రాజకీయముల కేర్పడిన యాయుద్యోగి
దొంగలంచము మేయ దొరతనంబె ?
సకలసౌందర్యలక్షణమైన సతిఁ బాసి
యలఁతిభోగముదానిఁ గొలువఁ దగునె ?
మహనీయమగు న్రగమతధర్మ మెడఁబాసి
దుర్మతంబులదారిఁ ద్రొక్కఁ దగునె ?
గీ. మంచిచెడ్డలు లేవాయె మానవులకుఁ
బుణ్య మడుఁగంటెఁ గలి పరిపూర్తిఁ జెందె
నేమి సేయుదు దుష్కాల మేమనందు ?
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 16

సీ. మగని రచ్చకులాగి మల్లయుద్ధము సేయు
వింతకామిను లుద్భవించినారు
వేడ్కతోఁ బుత్రుల వేశ్యకొంపల కంపు
పింజారితల్లులు పెరిగినారు
తెచ్చికొన్నఋణంబు దీర్ప దక్షతలేక
చివికి యెందఱో సన్న్యసించినారు
ధరణినాయకులయాదరణ మించుకలేక
వేదపండితులెల్ల విఫలులైరి
గీ. తురకవేషంబు ద్విజులకు దొడ్డదయ్యె
పాడుబుద్ధులు తెలివిగాఁ బరిణమించె
నింత దుర్మార్గకలికాల మెటుల వచ్చె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 17

సీ. దొడ్డవారల నేటి దూషించుటకుఁ గాదు
పలుగాకులకు నీతి దెలుపుకొఱకె
కులవధూమణుల కెగ్గులు పన్నుటకుఁ గాదు
మహిని లంజలబుద్ధి మార్చుకొఱకె
అగ్రవర్ణమువారి నదలించుటకుఁ గాదు
శూద్రజాతికిఁ ద్రోవఁ జూపుకొఱకె
దానశౌండులను నిందలు సేయుటకుఁ గాదు
కృపణచిత్తులను శిక్షించుకొఱకె
గీ. పరమతంబుల ఖండించుపనికిఁ గాదు
స్వమతసంరక్షప్రీతిఁగో సలుపుకొఱకె
చతురమతిఁగోడఁ గావింతు జతన మిపుడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 1

సీ. దుష్టాహి ద్రావిన దుగ్ధంబు తలపోయ
మహిని దుర్విషముగా మారినట్లు
జ్వరవిపన్నున కెన్నఁ బరమాన్న మిడుచున్న
చేదుతీరై నోరు జెఱచినట్లు
నాస్తికాగ్రణికి విజ్ఞానంబుఁ గఱుపంగఁ
గర్ణశూలముభంగిఁ గాఁగిలినట్లు
కులటగర్భమునందుఁ గలిగు ముద్దులబిడ్డఁ
డాయమ్మకుఁ బిశాచ మయినయట్లు
గీ. లార్య లొనరించు సత్కార్య మవనియందు
దుష్టజనులకు వెగటుగాఁ దోఁచుచుండు
విశ్వమంతయు మెప్పింప విధికి వశమె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 19
సీ. వేశ్యకాంతలఁగూడి విఱ్ఱవీగినకీడు
పెక్కుబాధల మంచ మెక్కునాఁడు
నన్నదమ్ములభూము లపహరించినచేటు
సాపాటునకు లేక చచ్చునాఁడు
దేవాలయపుసొమ్ము తెలిసి మ్రింగినకీడు
వంశవృక్షము కూలబడిననాఁడు
తలిదండ్రులకు కూడు తగ నొసంగనికీడు
కొడుకు లీడిచి తన్ని కొట్టునాఁడు
గీ. తెలిసి యేడ్చిన ఫల మేమి దిగులు జెంది ?
విధినిషేధంబు లెఱిఁగి వివేక మూని
పడయఁగావలె మునుముందు బ్రతుకుతెఱువు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 20

సీ. నిండుచందురులోన నెఱసు గల్గిన రాణ
మొగలిపువ్వున ముండ్లు మొనయులీల
నవయౌవనునకు షండత్వ మబ్బినమాడ్కి
పండితాళికి నెవ్వ నిండుభంగి
తగు సుందరికిఁ గోతిమగఁడు దక్కగురీతి
నిల్లాలు వంధ్యయై యెసఁగుభాతి
ముషిణిపండున తీవ్రవిషము నిండినజాడ
నత్తిపండున పుర్వు లలరుకరణి
గీ. భయదతరఘోరవిషయుక్తపన్నగంబు
మంచిగంధంపుఁ దరువున మలయునటుల
గొప్పవారికె దుర్మార్గగుణము లడరు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 21

సీ. సర్పయోని జనించి శయ్యయై గ్రాలఁడే
శ్రీవిష్ణువున కాదిశేషమూర్తి
మూపురంబున విష్ణు ముదమార నిల్పఁడే
విహగజాతిని బుట్టి వినతకొడుకు
శ్రీరామపాదంబు శిరసా వహింపఁడే
హనుమన్న శాఖామృగాళి మిన్న
అసురుఁడై పుట్టి ప్రహ్లాదుఁ డర్చింపఁడే
నారసింహస్వామి భూరికరుణ
గీ. కులము జాతియుఁ బనిలేదు గుణము లున్న
ప్రణుతిగాంచును నీ యనుగ్రహము గాంచు
సర్వసిద్ధికి మూలంబు సద్గుణంబు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 22

సీ. క్రొమ్మక్రొమ్మకు నెక్కు కోతి కోతియ కాదు
చపలచిత్తుఁడు కోతిజాతివాఁడు
గోహింసకుఁడె తురుష్కుఁడు గాఁడు గోజాతిఁ
బస్తు లెట్టెడివాఁడె పచ్చితురక
విటులపై దండెత్తు వేశ్య వేశ్యయ కాదు
విభునిరచ్చల కీడ్చువెలఁది వేశ్య
చచ్చినపై జంపు జముఁడు కాలుఁడు గాఁడు
ప్రజలకూడు హరించుప్రభుఁడు యముఁడు
గీ. పచ్చికను మేయుపసరంబు పశువుగాదు
పండితులచేతఁ జీకొట్టఁబడియు బుద్ధి
గడ్డి తినువాఁడు పో రెండుకాళ్ళపశువు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 23

సీ. సౌందర్యవతి యంచు క్షమియించునే భర్త
పడఁతి అంకుతనంబు బయలువడిన
నగ్రజన్ము లటంచు నాదరింతురె ప్రజల్
క్రొవ్వి బూతులు నోట రువ్వుచున్న
విబుధసత్తము లంచు విడుతురే పార్థివుల్
జీవహింసలు వీట సేయుచున్న
ఉన్నవారని యూరకుందురే బాంధవుల్
చిన్నచూపున లెక్క సేయకున్న
గీ. జట్టలూడంగ దుడ్డుతోఁ గొట్టుచుండ
వృద్ధులని యూరకుందురే వీరబలులు
పట్టి కుదుపక పోవునే పాపఫలము
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 24

సీ. కొసరి కోయిల కూయుదెసఁ గాకి కూయదే
భోగి యుండినచోట జోగి లేఁడె
యేనుఁగుల్ జనుదారిఁ బీనుఁగుల్ నడువవే
తురగంబు గల పంచఖరము లేదె
కలహంస వసియించుకొలన నుండదె కొంగ
నెయ్యిఁ గల్గినసంత రొయ్య లేదె
సింగంబుగల కానఁ జేరదే చెడునక్క
సుమతి యుండినవీటఁ గుమతి లేఁడె
గీ. నుత పతివ్రత నోచెడినోము లెల్ల
నోమదే పచ్చిలంజె దుష్కామ మడరఁ
దగులఁ బడినను వారు వీరగుట కల్ల
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 25

సీ. పురవీథిఁ జను గంధకరిరాజమునుఁ గాంచి
వెనువెంట మొఱుఁగవే శునకతతులు
సౌందర్యనిధియైన సాధ్విపైఁ గనుకట్టి
యట్టి ఱంకులరాట్ట మనరె ఖలులు
పడయనేరని ద్రాక్షపండ్లు చేదని చెప్పి
యిక్క కేగవు టక్కు నక్కగములు
ఋషు లొనర్చెడి తత్త్వవిషయబోధను విన్న
మాలబూతనరె దుర్మార్గజనము
గీ. లిట్టివారల నొక లెక్క పెట్టకుండ
దిగదుడిచివైచు రోమంబు ధీరవరుఁడు
నతజనావన ! సురకల్ప ! నాగతల్ప !
విదత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 26

సీ. వేశ్యకాంతలసొమ్ము వింతచీరలపాలు
రాజులద్రవ్యంబు రాళ్ళపాలు
చాకివారలసొమ్ము చల్లపందిరిపాలు
సాధులసొమ్ము గంజాయిపాలు
కమ్మవారలసొమ్ము కడకు నల్లురపాలు
వసుధ రైతులసొమ్ము పసులపాలు
విష్ణుభక్తులసొమ్ము వేడిపొంగలిపాలు
కరణాలసొమ్ము పొగాకుపాలు
గీ. జగడిగొండులసొమ్ము వ్యాజ్యములపాలు
దత్తపుత్రులసొమ్ము పెద్దమ్మపాలు
కదల కుండదు సిరి వెయ్యికాళ్ళజెఱ్ఱి
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 27

సీ. ఎద్దు మొద్దగు గొడ్డుపెద్దమ్మ యెఱుఁగునే
యడ్డాలఁ బడు చంటిబిడ్డముద్దు
వృద్ధజంబుక మింత విడువంగ నేర్చునే
పెరలకీడుఁ దలంచు పెద్దజిత్తు
తురకచేతులు జూచు దొడ్డమ్మ యెఱుఁగునే
వరపతివ్రతపుణ్యావర్తనంబు
కాలంబుఁ గడచిన వ్యాళంబు వీడునే
విమధారలను గ్రుక్కు విషముబుద్ధి
గీ. కోరి పెంటలఁ గబళించు నూరకుక్క
యెఱుఁగునే యాజ్యమాధుర్య మెన్నఁడైన
తలఁప దుర్మతులకు నీచదశలు గావె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 28

సీ. పరపూరుషులఁ జూడ వెఱ వెఱింగిన జాణ
మగనికన్నులు వోవఁ బెగడునొక్కొ
విటులకౌఁగిటఁ జేర వెదకుచుండెడిజాణ
విభునిబాహువులు దుల్లవెఱచునొక్కొ
పరనాధులకుఁ బిండివంట లంపెడిజాణ
మగనియాఁకటి కింత వగచునొక్కొ
కొసరి పల్లవులతో గుసగుసల్ గలజాణ
బధిరుఁడౌ పతిఁ గాంచి వగచునొక్కొ
గీ. కోడెకాండ్రకుఁ దలదువ్వ కులుకులాడి
మగని చింపిరితలఁ జూచి వగచునొక్కొ
యిట్టివారల సృజియింప నేటికొక్కొ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 29

సీ. ఫాలభాగమునిండఁ బంగనామము లుండఁ
దలఁప వైష్ణవుఁడౌనె దాసరయ్య
గళమందు పెద్దమంగళసూత్రమును గట్ట
వరపతివ్రత యౌనె వారకాంత
యెద్దుపగ్గమువంటి మొద్దుజందెము వేయ
దొడ్డబ్రాహ్మణుఁ డౌన యొడ్డివాఁడు
వెస బనారసుచీరఁ బిస దాల్చి చనుదేర
జాతసుందరి యౌనె కోతిముండ
గీ. సొరిది మీసంబు వడివేసి చూచునంత
భీరుఁ డారయ జగదేకవీరుఁ డగునె
కపటనటనము లిల దాఁగఁగలుగు నెట్లు ?
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 30

సీ. తగుపాటివేలకు సందర్భమౌ నని యెంచి
గాడిదపై నెక్కఁ బాడి యగునె
విత్తమక్కఱ లేక పిల్ల నిత్తు రటంచు
నంధురాలిని బెండ్లియాడఁ దగునె
కాయకష్టములేక కలిమి యబ్బు నటంచుఁ
బరులసొమ్ము హరింప భావ్య మగునె
మాటిమాటికి రాక మరలిపోవలె నంచు
మహి చుట్టములపొట్ట మాడ్చఁ దగునె
గీ. తనకుఁ గల్గినధన మింత తఱుగకుండ
నెలమి శుష్కోపవాసముల్ సలుపఁ దగునె
యెంతభాగ్యము తనకున్న నేమి ఫలము
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 31

సీ. కలిమి చెప్పఁగరాని కాఱుకూతల కిల్లు
భాగ్యం బవార్యగర్వమున కిక్క
పరపీడన మొనర్చు వరపిశాచము
ధనము లుబ్ధగుణంబు తావలంబు
సిరి యన్యులను దూర వెట్టు వెఱింగినజాణ
సిరి హరిధ్యానంబుఁ జెఱచు మాయ
అసహిష్ణుతకు నెల్ల నాలవాలము లక్ష్మి
క్రోధదేవున కొక్కగుడి విభూతి
గీ. ధనము జారత్వమునకు నాస్థానసీమ
పరమదుష్టులచే పట్టువడినయట్టి
ధనముకన్నను నైచ్యంబు ధరణిఁ గలదె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 32

సీ. కన్నారఁ బరభాగ్యఘనతఁ జూడఁగలేని
యధమమానవుఁడె జాత్యంధుఁ డనఁగ
వేశ్యయెంగిలిమోవి నెసఁ జీకి చచ్చెండె
యుచ్ఛిష్టగణపతి యూహసేయ
తనయాలి నొరులకై తార్చి చంకలు గొట్టు
వ్యర్థుఁడే జీవచ్ఛవం బనంగ
ధనశాలియయ్యుఁ దాఁ దినఁ బెట్టఁగాలేని
శుద్రుఁడే గర్భదరిద్రుఁ డనఁగఁ
గీ. గొడుకులకు నన్న మిడకుండ గోడువఱచు
క్రూరచిత్తుఁడె నిజమైన గొడ్డుఁబోతు
వాఁడె ఘోరకిరాతుఁ డీవ్వసుధలోన
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 83

సీ. పుట్టకుండునె ముందు భువిఁ జుప్పనాతియై
మిధునసఖ్యతఁ బాపు మేటికూళ
జనియింపదే పునర్జన్మమం దసురయై
ప్రియబంధులకుఁ దంపి పెట్టు చెనఁటి
ప్రభవింపదే ముందుభవమందు భూతమై
ప్రాణమిత్రులకూర్మిఁ బాపు కుమతి
సంభవింపదె ముందుజన్మ పిశాచమై
తల్లిబిడ్డల బాసఁదలఁచు చెనఁటి
గీ. యవతరింపదె ముందు పెద్దమ్మ యగుచు
నక్కచెల్లెండ్ర నెడఁబాపు టక్కులాఁడి
కట్టి కడుపకపోవునే కలుమషలము
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 84

సీ. విభుపేడి విటులచే బిడ్డలఁ గనుదాని
నరసి పిల్లలకుక్క యనుట మేలు
తనసొమ్ము దాఁచి యందరిసొమ్ముఁ దినుదాని
నతిహేయమగు పంది యనుట మేలు
పతి యుండఁగా సానిపంచఁ బండెడువాని
నవని స్వామిద్రోహి యనుట మేలు
కొడుకులుండఁగ లంజెకొడుకు మేపెడువాని
నతులఘోరకిరాతుఁ డనుట మేలు
గీ. చదువు గల్గియు దననోట ముదుగుమాట
లాడునీచుని ఛండాలుఁ డనుట మేలు
యిట్టికుమతులు దివి కేగు టిలకు మేలు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 35

సీ. కన్నగానికి నిండుకలికి వెన్నెలబరువు
వేశ్యకాంతకుఁ బోతుబిడ్డ బరువు
పరమలోభికి నాప్త బాంధవావళి బరువు
స్థూలగాత్రికి వంటసాల బరువు
అతివృద్ధభర్తకుఁ దారుణ్యవతి బరువు
కులటకాంతకు సతీగోష్ఠి బరువు
జూదగానికి దొడ్డవేదవాక్యము బరువు
కాందిశీకున కంగకములు బరువు
గీ. చూడ విటులకు తమలంబచూలు బరువు
పాపచింతనునకు దైవభజన బరువు
నయవిహీనుల నెన్నంగ నాకు బరువు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 36

సీ. అరవపిల్లను బెండ్లియాడు నాంధ్రునిబాధ
 సర్వశోచ్యుని గన్న జనకుబాధ
తనముల్లె కరణ మింటను దాచు నరుబాధ
 మగువలంకు తెఱుంగు మగనిబాధ
చెడ్డచెల్లెల నింటఁ జేర్చు నన్నలబాధ
 కవులతోఁ గలహించు ఘనులబాధ
అత్తింటి కిల్లంట్రి మరుగు నల్లునిబాధ
 కుటిలశిష్యుఁడు గల్గు గురునిబాధ
గీ. గడ్డుగయ్యాళిగంప యా గొడ్డుముండ
కడరి పెంపకమగు పెళ్లికొడుకుబాధ
నాల్గుబాధలు దెలుపంగ నాకు బాధ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 37
సీ. మేళంబునను బాడు మేటిసాని లటుండఁ
 దిత్తిగాఁ డటుముందె మొత్తుకొనఁడె
భువిని దేవునికన్న మున్ను పత్రికృత్యమై
 పోసఁగదే గుడిపైన బూతుబొమ్మ
సర్వాధికారులా సార్వభౌములముందు
 నడువఁడే చాకలినాయకుండు
వేఁట కేతెంచెడు మేటియేన్గులకంటె
 శునక మొక్కటి ముందు చనుట లేదె
గీ. దివ్యసుందర యిందిరాదేవికంటె
ముందు క్షీరాబ్ధిఁ బెద్దమ్మ పొడమలేదె
పలుకవత్తురు నీచ లార్యులకు ముందు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 38

సీ. ఎంగిళ్ళఁ దిను మంచు నెవఁడు కాకికి సెప్పె
గుడ్లగూబ కెవండు కూత సెప్పె
బాధించు మని క్రూరఫణుల కెవ్వఁడు సెప్పెఁ
బలుజిత్తు లెవఁడు నక్కలకు సెప్పెఁ
గుట్టు మంచును దేలుకొండె కెవ్వఁడు సెప్పె
నెలితిండి యెవఁడు పందులకు సెప్పెఁ
బడఁదన్ను మనుచు నెవ్వఁడు గాడిదకు సెప్పె
నికిలించు మని కోఁతి కెవఁడు సెప్పె
గీ. నెక్కడో కుట్టుమని చీమ కెవఁడు సెప్పె
నైజదుర్మతు లగునట్టి నరుల కెపుడు
విడువనేరదు మదినున్న విషపుబుద్ధి
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 39

సీ. వేశ్యకాంతలు నోట విడిచిపెట్టినపాట
లమ్మవారలు వేడ్క నందినారు
అమ్మవారలు మాను నాచారవిధు లెల్లఁ
బంచమాంగన లభ్యసించినారు
నెఱిఁ గిరాతులు వీడు నిర్దయాభావంబు
క్షితి నగ్రజన్ము లార్జించినారు
అమ్మవారలపజ్జ నంతరించినలజ్జ
సానిజాతులు మెచ్చి పూనినారు
గీ. పోడిమిఁ జెలంగు గుజ్జంబు గాడిదయ్యె
హేయములు మెక్కు కాకంబు కోయిలయ్యె
కలియుగంబున నేమందుఁ గాలమహిమ
విదత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 40

సీ. కడగి భోగముదిట్టికంటె మాయమ్మాయి
కంత మించని మెచ్చుఁ గన్నతల్లి
కరము భోగముపుల్లికంటెఁ గోడలు పాడు
నంచుఁ జంకలుగొట్టు నత్తగారు
సానికంటెను భార్య సరసురా లని పొంగి
విఱ్ఱవీగుచు నుండు వెఱ్ఱిమగఁడు
సానివాద్యము సల్పుఁ జక్కఁగా మనుమరా
లని వెక్కిసవ్వు నయ్యమ్మగారు
గీ. నాకు లేకున్న మాన పో నీకుఁ గల్గె
ననుచుఁ జెల్లెలఁ గని పొంగు నక్కగారు
వెఱ్ఱిముచ్చటఁ దప్పింప విధికి వశమె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 41

సీ. వారకాంతలరీతి భావింపవలె నంచు
వెలయాంధ్రబసవంక వెడలు నొకతె
సాని వైఖరితోడ సవతు రావలె నంచు
సానిమేళముమెంట సాగు నొకతె
భోగకాంతలతోడఁ బోల్చుకోవలె నంచు
పీడెంబు చేఁబూని వెడలు నొకతె
గణికాంగనలకీర్తి గణియింపవలె నంచుఁ
గురులు పై కెగదువ్వి కులుకు నొకతె
గీ. వెలవెలందులవలె నుండవలె నటంచు
నభినయించుచు మాటాడు నతివ యొకతె
కానివనులకు లోనైరి మానవతులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 42

సీ. చిత్రాంగిసరసంబు చెవులపండువ సేసె
చూడరే మీసాద పాదుగాను
సారంగధరుఁ డెంత జాలిమాలినవాఁడో
తిలకింపరే తెల్వి తెల్లవాఱ
చెయివట్టి బ్రతిమాలు చిత్రాంగిమోహంబు
గాంచరే మీకనుల్ గమలిపోను
మేలుచక్కనిచుక్క యేల వృద్ధుని నేలుఁ
జెప్పరే మీనవ్వు చేటుఁ జెంద
గీ. ననుచు నాటకశృంగార మవధరించి
కులుకుచుండెడి తుంటరిగుబ్బలాడి
విభునితోఁ గాపురం బెట్లు వెలుగఁ బెట్టు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 43

సీ. బొట్టు లేదని కుంకముండయా యనుకొన్న
నఱుత మంగళసూత్ర మాడుచుండె
సకియలంగాఁ జూచి సానియా యనుకొన్నఁ
బుస్తెఁగట్టు మగండు పొంత నుండె
లలనజారుఁడెడిఁ గాంచి లంజయా యనుకొన్నఁ
గులములో వెలిలేకఁ గులుకుచుండె
మడి యెడ్డెతన మెంచి మాలదా యనుకొన్న
దేవాలయములందుఁ దిరుగుచుండె
గీ. ముండ ముత్తైదువయు నొక్కపోల్క నుండె
సాని సంసారిణియు నొక్కజాడ నుండెఁ
బుడమిఁ దరుణుల కెట్టియాగడము లక్కో
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 44

సీ. చెలఁగి పల్వురలోనఁ గులికి నవ్వఁగరాదు
నడువీథిలో ఱైకఁ దొడుగరాదు
పరులముందఱ జాణపలుకులాడఁగరాదు
పరుఁ డిచ్చు ద్రవ్యంబుఁ బడయరాదు
ఒంటిగాఁ బరునొద్ద నొదిగి నిల్వఁగరాదు
దారిఁ బోయెడువానిఁ జీరరాదు
పరనారి జనుదారి పరిహాసింపఁగరాదు
కీళ్ళు కేఁగుచు నవ్వి నిలువరాదు
గీ. అత్తమామలతోడ మాఱాడరాదు
నాథునకు నప్రియంబుగా నడువరాదు
తరుణులకుఁ గీర్తిఁ బడయు నాధార మిదియె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 45

సీ. ఇంటిచాకిరి భర్తకంటగట్టెడిభార్య
మగువ గాదది అంకుమగఁడు గాని
తోడికోడలిసిరుల్ జూడలేనిగయ్యాళి
నాతి గాదది చుప్పనాతి గాని
మగనితో నెప్పుడు జగడమాడెడిజాణ
యాలు గాదది యఱ్ఱతేలు గాని
మగనిచెంగట నేడ్పుమొగము బెట్టెడి జంత
కొమ్మ గాదదియుఁ బెద్దమ్మగాని
గీ. యిట్టి దౌర్భాగ్య యత్తింటి మెట్టినపుడె
శని ప్రవేశించు మగనికిఁ జచ్చి చావు
బ్రతికి నేమియు సౌఖ్యంబుఁ బడయలేఁడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 46

సీ. విప్రచండాల విభేదంబు లెఱుఁగునే
సంకరించుఁ జనించు పంకజాక్షి
పాపపుణ్యము లంచు భయ మూని నడఁగునే
దైవచింతన లేని తలిరుఁబోణి
మేలుకీడు లెఱింగి మెలఁగంగ నేర్చునే
పతినిఁ గాల్చుకతన్న పడఁతిమిన్న
కష్టసౌఖ్యము లన్న కాలంబు లెఱుఁగునే
పరులహేళన సేయు పాడుముండ
గీ. కఱకుఁదనముఁ గృపాళుత్వ మెఱుఁగఁగలదె
కందువులఁ దాను గడుపార గనని వంధ్య
యెంతమందికిఁ బట్టింతు మింతపొగలు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 47

సీ. పెరజవాహిరి నాచు పెద్దమ్మవిభవంబు
కుడువఁ గూటికిలేక మిడుకునాఁడు
తనభర్త కెదురాడు తనగయాళితనంబు
ముండయై యొకమూల మూల్గునాఁడు
పరులబిడ్డలఁ జావఁ బడఁదిట్టు చెలిపాల్లు
తనయింట మగవిత్తు తునుఁగునాఁడు
విటులతో నిలు లేచి వెడలిపోయెడికుల్క
వ్యాధిపీడనఁ బస్తువడిననాఁడు
గీ. పరశవంబులఁ గని భీతిఁ బాఱు సుళువు
శవము తనయింటఁ బడియుండి చననినాఁడు
తెలియనగుఁగాని యటుముందు తెలియఁగలదె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 48

సీ. పదిమందిలో భర్తఁ బట్టి తిట్టుట మాని
లోనఁ గొట్టు గయాలి లోకసాధ్వి
బిచ్చగానికి భిక్ష పెట్టకుండిన మాన
చెంబు లాగనివాఁడు క్షితికి దాత
విబుధు లిచ్చెడుబోధ వినకున్న మానె పో
గురుని దూరనివాఁడె పరమగురుఁడు
అలి నొల్లకయున్న నదెపోయె నన్నవ
స్త్రములైన నిడువాఁడె ధర్మరాజు
గీ. చేరి శరణన్న జనుల రక్షింపకున్న
హాని సేయనివాఁడె పో యర్జునుండు
కలియుగంబున నీనాఁడు తలఁచిచూడ
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 49

సీ. కుసుమకోమలితోడ గుసగుసల్ సలుపంగ
మందుఁ డైనను మేటి మిండఁడండ్రు
కల్లుద్రావువానితోఁ జెలిమిఁ జేసిన యంత
నిర్జరాధిపుఁ డైన నీచుఁడండ్రు
మూఢాత్ములకుఁ దత్త్వబోధఁ జేసిన యంత
నమరదేశికుఁ డైన నల్పుఁడండ్రు
మ్రుచ్చుతోడుతఁ జెల్మి ముచ్చటించిన యంత
ధారుణీధవుఁడైనఁ జోరుఁడండ్రు
గీ. దురితవర్తనులను గూడి తిరిగి నంత
ననఘవర్తనుఁ డైన నత్యధముఁడండ్రు
దోషముల నేర్పరింపరు దుష్టజనులు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 50

సీ. తిరుమణి శ్రీచూర్ణతిలకంబు దిద్దఁడే
చేటంత మంగలిశేషిగాఁడు
కట్టుపంచకుబిళ్ల కచ్చఁబోయఁగలేదె
తతమూర్ఖుఁడైన సాతానిజియ్య
కోదువవెట్టక మూతిగోఁతిగించు కొనలేదె
వీధినాటకమాడు వెంకటప్ప
భుజముఁ జక్రాంకితమ్మునఁ గాల్చుకొనలేదె
నయముగా నుప్పరి నాయనప్ప
గీ. పారమార్థిక మెఱుఁగక బ్రతికనేని
వైష్ణవునికంటె శూద్రుఁడే వాఁడె ఘనుఁడు
వేషభాషలలో లేదు విష్ణుభక్తి
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 51

సీ. కుటిలాత్మునకు లేదె కోమలంబగునవ్వు
లంజకానికి లేదె లాలనంబు
గజదొంగ పల్కఁడే ఘననీతివాక్యంబు
కొండెకానికి లేదె గోడచాటు
తతలుబ్ధుఁ డెఱుఁగఁడే దానధర్మఫలంబు
మేటిపందకు లేదె మీసకట్టు
పరమపాపికి లేదె వరభాగవతగోష్ఠి
వేశ్యకాంతకు లేదె వెడఁదపుస్తె
గీ. త్రాగుఁబోతునకును లే తమ్మలంబు
గొడ్డువానికిఁ గల్గదే దొడ్డధనము
వీరి నయముల నెవ్వాఁడు వినుతిసేయు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 52

సీ. సంతానవతియౌన సార్వభౌమునిపుత్రి
విభునితోడుతఁ బొత్తు వెలయకున్న
నవనిఁ బూజితుఁడౌన యగ్రజాతినరుఁడు
కులధర్మములు మాని కులుకుచున్న
మహిఁ బతివ్రతయౌన మానినాథునిపుత్రి
యిండ్లగేండ్రనుగూడి యిడుకుచున్న
విద్యాధరుండౌన వెలయఁబండితసూతి
జీనమాలను దిద్దకూరకున్న
గీ. జ్ఞాననిధియౌనె పీఠాధినాయకుఁడు
నింద్రియంబులలోలత్వ మెడలకున్న
నుచితధర్మము గమనింప నొందుఫలము
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 53

సీ. నల్లరూపము గల్గె నవమాధవుఁడనంచు
గొల్లపిల్లనుబట్టఁబల్లు వీఱుగు
కృష్ణనామము గల్గెఁ గృష్ణదేవుఁడనంచు
చెడ్డమాయలు వన్నఁ జెంపపగులు
చక్రాంకితం బయ్యె చక్రపాణి నటంచు
విక్రమాధ్యునిదాకఁ బీఁచమణఁగు
వడుగురూపము గల్గె వామనుండ నటంచు
బలి నెదుర్కొన శృంగభంగ మొగవు
గీ. నూర్ధ్వపుండ్రము గల్గె దామోదరుండ
ననుచు మున్నీటఁ బవళింప నణఁగుఁ దిమురు
పరమకళ్యాణమూర్తితో నరుఁడు పురుడె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 54

సీ.. అగ్రజాతుఁడనంచు నల్పజాతుల నెల్ల
హైన్యంబుతో జూచు నధమమతిని
భాగ్యవంతుఁడనంచు బహుదరిద్రుల నెల్లఁ
గష్టపెట్టఁగఁ జూచు దుష్టమతిని
విద్యాధికుఁడనంచు వీటివారల కెల్ల
లేనితప్పులు పట్టుహీనమతిని
విక్రమాఢ్యుఁడనుంచుఁ బిఱికివందలనెల్ల
గడఁగి కారియఁబెట్టు కలుషమతిని
గీ. రూపవంతుండు నంచుఁ గురూపిజనులఁ
బరిహాసింపగఁ జూచు నిర్భాగ్యనరునిఁ
బుటము పెట్టంగ నీవేల బూనవయ్య
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 55

సీ. నిరపరాధులమీద నిందమోఁపగరాదు
నెవ్వఁ గల్గినవారి నవ్వరాదు
పరులకొ సన్నంబుఁ బడఁగొట్టఁగారాదు
తొట్టిదీనులఁ గష్టబెట్టరాదు
పరదంపతుల కేళిఁ బరగఁ గన్గొనరాదు
భయవిహ్వాలుల భీతిపఱుపరాదు
జీవంబు గలవానిఁ జితిని జేర్పగరాదు
పసిపిల్లలను గాసి పఱుపరాదు
గీ. కుంటిమగనిని పడఁద్రోసి గెంటరాదు
పండితునిఁ బామరుండని వదరరాదు
తోయమగ్నునిపై బండవేయరాదు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 56

సీ. జపతపంబులు శూద్రజనముల పాలయ్యె
పరిణయంబగుభార్య పరులకయ్యె
ధనపిశాచము లోభిజనములే పాలయ్యె
కానివేషము కులాంగనల కయ్యె
గడిదిఁ గోవులగుంపు కటికల పాలయ్యె
వెలయమంగిలిపనుల్ ద్విజుల కయ్యె
కలితసాలగ్రామగణము సాతానుల
పాలయ్యెఁ గులవృద్ధి పాపికయ్యె
గీ. సకలవేదసంపుటములుఁ జదలకయ్యె
గప్పురపువీడెము వితంతుకాంతకయ్యె
నెంత దుర్దశఘటియిల్లె నింతలోన
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 57

సీ. ప్రమదాళి చరియించు ప్రమదావనములెల్ల
విహరణస్థలులయ్యె విధవలకును
వేదశాస్త్రపురాణ వితతలన్నియుపోయి
శృంగారకథలలోఁ జెలగెనేడు
దేవతాశ్రయములో దేవళంబులునేడు
ఖరపురీషముల కాకరములయ్యె
పథికవిశ్రాంతులౌ బహుసత్రశాలలు
జారచోరుల నివాసంబులయ్యె
గీ. భార్య పెట్టెడి యన్నంబు ప్రాణపతికి
వంటపూటింటి మెతుకులై వఱలెనేడు
కటకటా ! నేటి గ్రహచారకర్మమేమొ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 58

సీ. పేరు వచ్చునటంచు పిల్లసానులకెల్లఁ
గన్నెరికముసేయు ఘనుఁడొకండు
ఘనతవచ్చునటంచుఁ గనలి సాధులనెల్లఁ
దిట్టికొట్టెడు జగాజెట్టియొకఁడు
తెలివిఁ జూపఁగఁ బండితుల దండఁబడి యడ్డ
దిడ్డంబుగా వాగు ధీరుఁడొకఁడు
గాయకఖ్యాతికై కాశీపురముదాక
వెఱ్ఱిరాగములీయు వీరుఁడొకఁడు
గీ. కవి సమాఖ్యను గణియింపఁ గల్లపొల్లుఁ
బద్దెములనల్లి ప్రకటించు ప్రాజ్ఞుఁడొకఁడు
వెఱ్ఱి తెల్వికి లోనయ్యె విశ్వమెల్ల
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 59

సీ. ఒగిఁ బల్లకీ మోయ నోమో మనుచు నోట
మూల్గఁడే చాకలి పోలిగాఁడు
హీనజాతుల యింటికేగి పంచాంగంబు
వాసిఁ జెప్పఁడె మాల దాసరయ్య
మొగమునిండ విభూతిఁ బూసి రుద్రాక్షలు
నంతరింపఁడె గుంట జంగమయ్య
భుజము మోయఁగలేని మొద్దు జందెములిన్ని
దొడ్డుగాఁ దాల్పఁడే యొడ్డివాఁడు
గీ. భక్తివిద్యయు జపము శుభ్రతయులేని
బ్రాహ్మణాధముకంటె వీరలె మహాత్ము
లనుచుఁ బెద్దలు వచియింతు రవనియందు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 60

సీ. శెట్టి యుల్లియలమ్మి జీవింపవలెనన్న
నా లాభమును విప్రు లందినారు
గొల్లండు చల్లమ్ముకొన గంజిగలదన్న
బాపనమ్మలకు నభ్యాసమయ్యె
పాటఁ బాడుచు వేశ్య బ్రతుకవచ్చునటన్న
సంసారి గానముల్ సభలకెక్కె
పొలముదున్నుచుఁ గాపు భుక్తి పొందెదనన్న
నయ్యవారలు దుక్కికొయ్యఁబట్టె
గీ. సానితమ్ముండు మద్దెలఁ జఱచియనెద
నన్న పంతుల్లమెడ మద్దె లాడుచుండె
కొదమ సింగంబునకుఁ గుక్క గుణములబ్బె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 61

సీ. శ్రాద్ధాన్నములు మెక్క సాహసించెడి కుక్క
వల్లకా దేరీతి వదలఁగలదు
కోరి యొక్కతె వండుకొని మెక్కు నిల్లాలు
నెమ్మి చట్టము పొట్ట నించుటెట్లు
ఊరిపెల్సలి హేయమూరి మెక్కెడి పంది
యొదిగి కొమ్మరిదొడ్డి నుండుటెట్లు
మాంసభక్షణసేయ మరగిన విప్రుండు
భార్య వంటకము లేపగిది మెచ్చు
గీ. మనుజరక్తముఁ జవిచూడ మరగువ్యాఘ్ర
మెట్లు పురసీమఁ బడకుండ నిచ్చగించు
నలవడినదాని విడువంగ నలవియగునె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 62

సీ. తనయింట ధనరాసు లెనసి మూల్గుచునుండ
మేటి దేవునిసొమ్ము మ్రింగఁదగునె
తను గట్టుకొనిపోవఁ దగినంత పొలముండ
క్షితిఁ బేదపొలముఁగాఁ జేయఁదగునె
తనభార్య రంభయై తనశయ్యఁ బడియుండ
నన్యకాంతకుఁ బ్రాకులాడఁదగునె
తాను దొర్లాడంగఁ దగిన మేడలుగల్గ
గుడిసెపేదను వెళ్లఁ గొట్టనగునె
గీ. పరగఁ దనయింటిలో బానపాడిగలుగ
బరులగంజికిఁ బేరాస వడఁగఁదగునె
బుద్ధిహీనుండు జగతికిఁ బూజ్యుఁడగునె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 63

సీ. ఇరువంకలకులాగు నిరువురాండ్రకు మధ్య
స్తంభించువాఁడె త్రిశంకుఁడనఁగ
నరజన్ముఁడయ్యు గానన మృగోపమబుద్ధి
సేయు క్రూరుఁడె నారసింహుఁడనఁగ
పరువ్రాఁడ నేప్రొద్దు భార్యవెంటఁ జరించు
స్త్రీలోలుఁ డర్థనారీశుఁడనఁగ
జీకొట్టినను వేశ్యవాకిళ్లఁ దిరుగాడు
నవివేకి కాలభైరవుఁడనంగ
గీ. నెంతజెప్పినఁ దెలియని హీనమతియె
పురుషవృషభుఁ డనంగ నిప్పోల్కిఁగవుల
భాష్యములు దూష్యములుగావు పరిహాసనములు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 64

సీ. స్వప్నమందు లతాంగి సరసమాడుటసుమా
జారిణీరతికేళి సౌఖ్యమనఁగ
త్రాచుఁ బామునకు క్షీరమును పోయుటసుమా
చెలిమి లంజలను బోషించుటనఁగ
మృత్యుదేవతను ప్రేమించి తెచ్చుటసుమా
చెలఁగి లంజియనింటఁ జేర్చుకొనుట
ముపిడిరంగను జూచి మోహమొందుటజుమా
సానివేషము జూచి సరసుఁడగుట
గీ. అగ్నిసాక్షిగఁ గొన్న భార్యను త్యజించి
లంజెతోఁ గాపురముసేయు లంజెకాఁడు
తుచ్ఛుఁ డవివేకి పతితుండు ద్రోహి కూళ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 65

సీ. శమదమాభ్యాసాది సద్గుణవ్రతుఁడేని
ఛండాలుఁడైన సాక్షాచ్ఛివుండు
శరణాగతత్రాణ సద్గుణవ్రతుఁడేని
పరిపంథిజనుఁడైనఁ బరమువిష్ణు
పరమపాతివ్రత్య భరితసద్గుణయేని
యేకరూపుణియైన లోకరంభ
అను జన్మలను బ్రేము మనుచు సద్గుణుఁడేని
ధరఁ గిరాతకుఁడైన ధర్మరాజు
గీ. భూతదయతోడ సద్బుద్ధిఁ బొదలెనేని
ఓనమాల్ రాని జడుఁడైన నూర్ధ్వగురుఁడు
ధార్మికుల నిశ్చితార్థ మీఁదారినుండు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 66

సీ. సుగుణ మేమియు లేని శుంఠ సుందరరూపుఁ
డైన నేమి కురూపి యైన నేమి
పిట్టిపోయ్యఁగలేని పెనులోభి కోటీశుఁ
డైన నేమి ధనేశుఁ డైన నేమి
సాయ మొన్నఁడురాని చచ్చుచుట్టము వీట
నున్న నేమిక గాట నున్న నేమి
ప్రజల మే లరయని ప్రభువు క్షత్రియవంశ్యుఁ
డైన నేమి కిరాతుఁ డైన నేమి

గీ. మగనితోఁ గాపురములేని సొగసులాడి
యైదువయినను నేమి ముం డైన నేమి
యంతరములేదు వీరిలో నరసిచూడ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 67

సీ. జనుము పూదిననాటి సౌందర్యవిభవంబు
వరిచేల కీలిలఁ బలుకఁగలదు
వేశ్యదేవతకబ్బు వేమచాతుర్యంబు
సంసారతరుణి కే సరణిజరుఁగు
వట్టి శుంఠలకబ్బు పటువాక్ప్రలాపంబు
పండితాత్ముల కేలఁబరగియుండుఁ
గుల సంకరునకున్న గురుతరాచారంబు
కులసత్తమున కేల గొఱలఁగలుగు

గీ. సారిదిఁ గొంగల గమనంబు సోయగంబు
రాజహంసలకెట్లు సంప్రాప్తమగును
దంభ చరితంబు లీరీతిఁ దనరుఁగాక
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 68

సీ. గొల్లవాఁడనుఁగాడు నల్లవాఁడనుఁగాడు
కులరూపములులేని వెలుఁగుగాని
గిరివల్లభుఁడుగాడు సిరివల్లభుఁడుగాడు
శుద్ధసత్వపు పరంజ్యోతిగాని
గుణశూన్యుఁడనుగాడు గుణమాన్యుఁడనుగాడు
భావానుకూలుఁడై పరఁగుఁగాని
పూవుబోఁణియుఁగాడు పురుషోత్తముఁడుగాడు
మాయచే జనసృష్టి సేయుఁగాని

గీ. యోగి హృత్పుండరీకసంయోగి పరమ
పురుషుఁడవు నీవ యనుచు వేదములు దెల్పు
మూఢభక్తియె చాలును మోక్షమునకు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ!

సీ. కల్పవృక్షమ నీవ కామధేనువు నీవ
కౌస్తుభమణివీవ కమలనాభ
ధర్మమూర్తివ నీవ కర్మపూర్తివి నీవ
భూనభంబులునీవ పుణ్యపురుష
శిష్టరక్షకుఁడీవ దుష్టశిక్షకుఁడీవ
దీనబంధుఁడవీవ దేవదేవ
వాయుదేవుఁడవీవ వాసుదేవుఁడవీవ
నారాయణుఁడవీవ నరుఁడవీవ

గీ. నీవ పదివేషములసామి నీవ బ్రహ్మ
రుద్రుఁడవు నీవ జాంబునదాద్రివీవ
విశ్వములు నీవ పాహిమాం విష్ణుదేవ
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ!

సీ. నునుపు మీఱినకొండ నోరుమాలినరండ
కయ్యంబుఁ బెంచని ఘననియోగి
కదలకుండెడి గాలి కరువని బెబ్బులిఁ
గాలెత్తి తన్నని గార్ధభంబు
బురద మెచ్చనిపంది పోతరింపని నంది
శవముఁ బీకనియట్టి జంబుకంబు
మంచిచేష్టలుకోతి మచ్చరింపనిజ్ఞాతి
చల్లని బడబాగ్ని తెల్లకాకి
గీ. మాయలెఱుఁగని వెలయాలు మంచితేలు
నోము పట్టనిసాని యన్యోన్యమైత్రిఁ
గాపురముఁ దీర్చు సవతులు గానరారు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 71

సీ. పొట్టకూటికిలేని పుట్టిల్లు గలదాని
నాదరించెడివాడు ప్రాణవిభుఁడు
కోరుఁ గోరికలెల్లఁ గువలయాక్షికిఁ దీర్చు
ప్రత్యక్ష దైవంబు ప్రాణవిభుఁడు
కలకాలమును నొక్క గారాముతో జూచి
రక్షింపగలవాడు ప్రాణవిభుఁడు
యెట్టికష్టములైన నెలమితో భరియించు
యలరించు గుణరాశి ప్రాణవిభుఁడు
గీ. కాంతతోడుతఁ గష్ట సౌఖ్యంబులెల్ల
సమముగా బంచుకొనువాఁడు రమణుఁ డొకఁడె
పతినిఁ బోలెడి దైవంబు సతికిగలఁడె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 72

## రాఘవ వేంకటేశ్వర శతకము.

సీ. గయ్యాళి తరుణితోఁ గాపురంబునకంటెఁ
కయ్యమాడని మాచకమ్మమేలు
మతిలేని నృపునొద్ద మంత్రియై మనుకంటెఁ
గొనరి బిచ్చము నెత్తికొనుటమేలు
కపటియా గురునొద్దఁ గాలయాపనకంటె
వెడలి బొబ్బిలిపాట వినుటమేలు
ప్రేమ సుంతయులేని పెక్కు భార్యలకంటె
పతిభక్తిగల యేకపత్నిమేలు
గీ. వారి వీరిని మాపి కుబేరుఁ డగుట
కంటె కష్టార్జితంబొక్క గవ్వమేలు
లాతి పెరుమాళ్లకంటె నీలావుమేలు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! .
సీ. తీర్థయాత్రలుఁ జేసి తిరిగి వచ్చెదమన్న
నాథుఁ డాని యనుజ్ఞ వేడవలసె
బిచ్చగానికి భిక్షబెట్టి పంపుదమన్న
నింటియాఁడుది యానతీయవలసె
పెలుఁగ బెట్టినబుట్ట గొాఁతిగించుకొనుటకై
యింటియాఁడుది విత్తమీయవలసె
వియ్యాలవారికై విందు సేయుదమన్న
గయ్యాళి సతి యాజ్ఞ గాంచవలసె
గీ. సకట మగవారి బ్రతుకు కిట్టు లధమమయ్యెఁ
దగనిభార్యకు సర్వస్వతంత్రమయ్యెఁ
గాంత మగఁ డయ్యె మగఁడును గాంతయయ్యె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !

సీ. మదనమోహనుఁడైన మగనిరూపముఁ జూచి
వేడ్కఁ జెందదుగదా విద్రుమోష్ఠి
విమలసద్గుణుఁడైన విభుని శీలముఁ గాంచి
ముదముఁ గూర్పదుగదా సదమలాంగి
తతకీర్తిధరుఁడైన ధవుని మాన్యతఁ గాంచి
గోప్యముంచదు గదా కువలయాక్షి
ఘనకళానిధి యైన కాంతుబుద్ధి దలంచిఁ
గారవింపదు గదా కమలగంధి
గీ. సదయుఁడైన మనోనాథు మది నెఱింగి
నయ మొనర్పదుగద ధాత్రి నాగవేణి
కాలకుటిలత సతులందె కాననయ్యె
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 75

సీ. నిజమనోనాథు మన్నించి పిల్వదుగదా
పరిజల నోటికి భీతిఁబడసిదైన
ప్రాణనాథునిసేవ పూని సేయదుగదా
దైవంబునకుఁ గొంతతలకిదైన
పతికి సౌఖ్యముఁ గూర్ప మతి దలంపదుగదా
తనప్రాణసముఁ డంచుఁ దలఁచిదైన
జీవితేశునియాజ్ఞ స్వీకరింపదుగదా
పెండ్లిబాసకు సుంత వెఱచిదైన
గీ. ప్రాణవిభుతోడ సరసంబులాడదుగద
ధవునిమోహంపు ముచ్చటల్ దలఁచిదైనఁ
గాలగతి మీఱె స్త్రీబుద్ధి కలతఁబాఱె
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 76

సీ. చెలఁగి పాదము లొత్తు జీవితేశుని జూచి
దయ దలంపదుగదా తలిరుఁబోఁణి
వజ్జఁజేరి విభుండు బుజ్జగించె నటంచు
నవ్వి పల్కదుగదా పువ్వుబోఁణి
భయముతోఁడ మగండు పాన్పు వేసె నటంచు
జాలిఁ జెందదుగదా నీలవేణి
తమలపాకులు జుట్టి ధవుఁ డొసంగె నటంచుఁ
దిరిగి చూడదుగదా తీఁగబోఁణి
గీ. సుందరాంగికి పతిభక్తి శూన్యమయ్యె
రమణి కిలఁ బుణ్యచింతన రహితమయ్యెఁ
గాలచక్రము విపరీతగతిఁ జెలఁగె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 77

సీ. పతికేడ కోపంబు వచ్చునో యనువారు
కన్ను లెఱ్ఱఁగఁజేయఁ గడఁగినారు
మగఁడు తిట్టునటంచు బెగడు జెందెడివారు
ధవుని చెంపలు గొట్టఁదలఁచినారు
విభుఁడు కొట్టునటంచు వెఱచుచుండెడివారు
దుడ్డు చేకొని మొత్త దొడఁగినారు
వరుఁడు వీడు నటంచు వడకుచుండెడివారు
పురుషు నావలగెంటఁ బూనినారు
గీ. పతికి మెండయ్యె భార్యపై ప్రాణభయము
భర్తభార్యకు నొక తృణప్రాయమయ్యె
నీతిజాతియు లేదయ్యె నెలఁత కిపుడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 78

సీ. నతివిహారము సల్పి చనుదెంచు నంతలో
వండియన్నము సిద్ధపరుపవలసె
జెలియమజ్జనమాడి చేరుచో నెదురేగి
మడిచీర చేతిలో నిడఁగవలసె
వెలదిభోజనమైనవేళలోఁ దరిజేరి
మడుపుటాకులు నోటి కిడఁగవలసె
తరుణిపాన్పునజేరు తరుణంబులో నేగి
బత్తి మీరఁగ బాదమొత్తవలసె
గీ. నెలత నిద్రలేవకమున్నె నెమ్మితోడఁ
బిండివంటల నమరించి పెట్టవలసె
హీనసతికల్గు మగఁ డిట్లు లేద్వవలసె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 79

సీ. నడుకాన విడువఁడే నలినాక్షి దమయంతి
న్యాయంబుఁ బాయని నలవిభుండు
సతిఁ జంద్రమతి హరిశ్చంద్రుఁ డమ్మఁగలేదె
కరుణమాలిన కాలకౌశికునకు
నిప్పుగుండముఁ ద్రొక్క నియమింపఁడే సీతఁ
బ్రేమంబు మాని శ్రీరామమూర్తి
నిన్నెఱుంగ నటంచు నిరసించి పలుకఁడే
యలశకుంతలను దుష్యంతవిభుఁడు
గీ. ద్రౌపది పరాభవము సైచె ధర్మరాజు
మగని నమ్మినఁ జెడిపోవు మగువ యనుచుఁ
దూలనాడుదు రీనాటి తులువచెలులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 80

సీ. పతికిఁ బాదములొత్తు బత్తియంతయుఁ బోయి
కుత్తుకల్ నులుమంగఁ గోరినారు
విభునిసౌఖ్యము గోరు వేడ్క లన్నియు బోయి
చింతముంచగ సాహసించినారు
వరుని ముచ్చటతోడ సరసమాడుట మాని
యలిగి క్రోధము లాడదలఁచినారు
పతికి ధైర్యముఁ గొల్పు భావ మెల్లను బోయి
కరము దైన్యముఁ గూర్పఁ గడఁగినారు
గీ. ధవునిదైవంబుగా నాత్మఁదలఁచువారు
కొఱవిదయ్యంబుగాఁ జూడ మరగినారు
అబలలకు నేఁడు దుర్బుద్ధి ప్రబల మయ్యె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 8

సీ. సానిబావాలకొప్పె సౌందర్యమని చంకఁ
గానుపించెడి రైకఁ బూనినారు
వేశ్యకందముఁ దెచ్చి పెట్టెనంచును రేల
లంగాలఁ దొడిగి యుప్పొంగినారు
గడనకత్తెకుఁ జాల ఘనతఁ దెచ్చెనటంచు
గనులఁ గాటుకమాని కదలినారు
వారకాంతకుఁ గ్రొంత వన్నె వచ్చెనటంచు
వింత వింతల జడల్ వేసినారు
గీ. వెలచెలులబోలు కొందరు తులువచెలులు
కలఁడొ లేఁడొ మగం డన్నకరణి నుదుట
పెట్టిపెట్టని తిలకంబుఁ బెట్టినారు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !

సీ. పాఱఁజాచినకాలు బండి బైటికిఁ జాచి
తమ్ములమ్ములు మేయు కొమ్మయొకతె
టెక్కుమై జడయూఁగఁ బక్కు పక్కుననవ్వి
లేనిగొప్పలు బల్కు లేమయొకతె
పెద్ద సంగీతంపుఁ బెట్టుఁ దే తెమ్మంచు
బండి నెక్కుచుఁ గేక వైచునొకతె
పాగబండిలో నెక్కి పాత్ర మొక్కటివిప్పి
శృంగారపద్యముల్ జెప్పునొకతె
గీ. చంటిబిడ్డకుఁ బాలియ సమయమనుచు
పరులు జూడంగఁ బయ్యెదఁ బాపునొకతె
చెనటిచెలులప్రయాణవిశేష మిదియ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 83

సీ. పదిమందిలో భర్త నెదిరి పల్కఁగరాదు
పెట్టని పుట్టింటిఁ దిట్టరాదు
ఒడలు గన్పడు జిల్గుముసుఁగుఁ దాల్పఁగరాదు
వీథినవ్వుచు జడల్ వేయరాదు
కోకనీళ్ళకు రెక లేకుండ జనరాదు
నీళ్ళరేవున జాము నిల్వరాదు
కోడికోడండ్రతో దొమ్మ లాడఁగరాదు
గృహరహస్యము బైటి కియ్యరాదు
గీ. ప్రాణవిభుఁ డుండ బాజారు కరుగరాదు
యితరగృహముల కేఁగి నిద్రింపరాదు
తలఁప సంసారవనిత లీ ధరణియందు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 84

సీ. దున్న వెన్నున కేల దొరలెక్క నంబారి
గాడ్దెపిల్లకు నోట గళ్ళె మేల
ఊరకుక్కకు నేల నుక్కుసింగపుబోను
జ్ఞానశూన్యున కేల చదువుసంధ్య
బ్రహ్మచారికి నేలఁ బండుపూవులపాన్పు
పరమలుబ్ధుని కేల బహుధనంబు
విధవాంగనల కేల వింతవింతల జడల్
పాడుకాకికి నేల పంజరంబు
గీ. కాందిశీకున కఱచేత ఖడ్గమేల
నంధునకు నేల భువనమోహనలతాంగి
మూఢవనిత కసన్మార్గ బోధయేల
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ!

సీ. బోడిగుండ్లు రహింప మూలమూల్గెడివారు
వింతవింతల జడల్ వేసినారు
ప్రారబ్ధమని కావిపంచెఁ గట్టెడివారు
చలువకోకలుఁ గట్టఁ గులికినారు
రామాహరీయంచు రహి జపించెడివారు
ప్రియప్రియా యని కల్వరించినారు
కుంభకోణపుఁ జెంబుగొని యాత్రఁ జనువారు
విటులకై నడురేయి వెడలినారు
గీ. మినుపరొట్టెలు నట్టింట మెక్కువారు
లంజతగవులు దీర్పఁ జెలంగినారు
విధవలోక కొందఱీ రీతి వెలసినారు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ!

సీ. క్షలుము లీనెడిలచ్చి కరవిచ్చు పెద్దమ్మ
మున్నీట నొకచోటఁ బొడమలేదె
హాలాహలవిషంబు నమలామృతరసంబుఁ
బొందుగా దుగ్ధాబ్ధిఁ బొడమలేదె
దుష్టరావణలోక శిష్టవిభీషణుల్
లలి నన్నదమ్ములై వెలయలేదె
కోమలంబదు పువ్వు కూ్రరమగా చెడుముల్లు
నొక్క-చెట్టునఁ బుట్టి యుండలేదె
గీ. యేకగర్భప్రసూతులై యెసఁగినంత
అవనిపై యక్క చెల్లెండ్రకైన నన్న
దమ్ములకునైన సమబుద్ధి ధరనులేదు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 87

సీ. వైష్ణవమ్మునఁ బుట్టి వగలు బాయనినారి
భువివృద్ధ వేశ్యయై పుట్టునేమొ
మాలజాతినిఁ బుట్టి మానంబుఁ గలసాధ్వి
యిల నగ్రజన్మయై యెసఁగునేమొ
పేదసొమ్ము హరించు వేదవిప్రుని భార్య
కడజాతికాంతయై పొడమునేమొ
ఆర్త రక్షణసేయు నంత్యకులాంగన
భువి సార్వభౌమియై పొసఁగునేమొ
గీ. హరిగుణమణు లెవ్వారలైన నేమి
పదుగురకుఁ బూజనీయులై వరలుటరుదె
ఆత్మనెఱుఁగరు గాక పెద్దమ్మవార్లు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 88

సీ. కులవధూమణికి ఱంకులు పన్నునంతనే
తన ఱంకుకథ సతీ ధర్మమగునె
ధర్మశీలురఁ బాపకర్ము లన్నరితనే
తన దుష్టకథ శిష్ట ధర్మమగునె
సచ్చరిత్రను నాలిమ్మృచ్చన్న యంతనే
తనకుళ్ళు విమలాత్మ ధర్మమగునె
భాగ్యశాలిని మందభాగ్య యన్నంతనే
తనదాస్య మైశ్వర్య ధర్మమగునె
గీ. తమ్ముఁ గడుయోగ్యులని ధాత్రిఁ దలఁతురనుచుఁ
బరుల యోగ్యతదూషించుఁ బాపమతుల
కుత్తుకల కడ్డుగాఁ గొఱ్ఱుఁ గొట్టవలదె
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 89

సీ. తనకొంప కాలిపోయిన దుఃఖమున నేగి
చుట్టుకొంపల నిప్పుఁ బెట్టతగునె
తనయాలు ఱంకువోయిన జాడ గుర్తించి
పరునియాలికిఁ దప్పు వట్టనగునె
తనకన్ను కానరాదని చింత మదిఁబూని
యవనీతలంబు లే దనఁగనగునె
తనకుమారుఁడు దుష్టుఁడని యాత్మ దిగులొంది
పరులబిడ్డల దూరఁ బాడియగునె
గీ. తనకు మరణంబు దరి జేరెనని తలంచి
పరుల గొంతుక నులుమంగఁ బాడియగునె
యింతకన్నను దుర్బుద్ధు లిలనుగలవె
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 90

సీ. పెద్దనీతులు సెప్పఁ బెద్ద లర్సింతురే
యల పాఁతఱంకు లూరంద రెఱుఁగ
పట్టుపుట్టముఁ జుట్టఁ బెట్టు టాచారమే
తురకమిండఁడు వెంటఁ దిరుగుచుండ
యింట "ఘోషా" జూచి యిల్లా లటందురే
సందుగొందులఁ గాలి జాడలుండఁ
బసదేవళము కేగ భక్తురా లందురే
గుడిగంట వినుచు మిండఁడు చొరంగ
గీ. కన్నులను మోడ్చి పాల్ద్రావుచున్న పిల్లి
యెవ్వరునుఁ దన్నుఁ గనరంచు నెంచు భంగి
భంగపడుదురు జారిణీ వనితలెపుడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 91

సీ. నేఁటి భాగ్యముఁజూచి నిక్కి నీల్గఁగ నేల
చింతయీనెల చారు ముంతమఱచి
మేడఁ గట్టితినంచు మిడిసిరాలఁగ నేలఁ
దడిసి కాఁపురమున్న గుడిసెమఱచి
సర్వాశ్రియులమంచు గర్వింపఁగా నేల
పదుర చంకలనాకు బ్రదుకుమఱచి
మాటకారి నటంచు మరి పండిపడ నేల
మోటుతిట్టులుతిన్న మాటమఱచి
గీ. తారసించిన తన గొడ్డుఁదనముమఱచి
పరులబిడ్డలపై రోఁత పడఁగనేల
బ్రతికినందుకు సత్కీర్తిఁ బడయవలయు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 92

సీ. పరుల సౌందర్యంబుఁ బరిహసింపఁగవచ్చు
దమ మర్కటాకృతుల్ దాఁగునాఁడు
చక్కనమ్మ గుణంబు లెక్కరింపఁగవచ్చు
తమ కుక్కనైజంబు దాఁగునాఁడు
పరనారిజనుదారిఁ బడదూరఁగావచ్చు
దమ లంజవేసంబు దాఁగునాఁడు
పరుల యాధిక్యంబు నిరసింపఁగావచ్చు
తమ లెంక పని యింటదాఁగునాఁడు
గీ. పరులదృష్టికి దోషంబు నెఱపవచ్చు
తాముఁ గనుగోవు బ్రతుకుతోఁ దనరునాఁడు
నెందరని చెప్పుతో నింక మంగలింతు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 93

సీ. ప్రాయంబు విటకాండ్ర పాలుజేసినభామ
వరపతివ్రతకాదె వార్ధకమున
కొంపలన్నియు నేలఁ గూలఁగాల్చినమీఁద
నగ్నిదేవుఁడు శాంతుఁ డగుటలేదె
మడిమాన్యములుపోయి కుడువఁ గూటికిలేక
విటుఁడు వేశ్యలపొందు విడుటలేదె
సస్యమంతయు ముంచి సంసారములనొంచి
వడితగ్గదే యేటివఱద పిదప
గీ. జేయవలసిన జెడుగులు జేసి తుదకు
నణఁగియుండిన ఫలమేమి ? యవనిలోన
జనుల కెవ్వారలకుఁ గల్గు సంతసంబు ?
విదత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 94

సీ. అత్తమామలనుండి యాత్మేశు నెడఁబాపు
దుష్టురాలికిఁ గల్గుఁ దుచ్ఛసుతుఁడు
కొడుకులఁ గోడండ్రి నెడఁబాపు కుమతికి
నాత్మపుత్రినిఁ గాల్చు నల్లుఁడౌఁదవు
నాలుబిడ్డలకు ద్రోహముఁ బన్ను గయ్యాళి
గంప పుట్టిల్లు శీఘ్రమె నశించు
పొరుగిండ్ల జవరాండ్రు కరసి యంకలుగట్టు
మీనాక్షికొడలు మ్లేచ్ఛఁదగులు
గీ. సనృతకార్పణ్య కపటమాయాకృతఘ్న
దుష్ప్రలాపంబు లధికంబు తొయ్యలులకు
దాన స్త్రీత్వంబు నింద్యంబు ధరణియందు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 95

సీ. దమయంతిఁ బోలు నుత్తమకాంత లుండరే
పేదరాండ్రని పూజ లేదుగాక
దండితోఁ దులఁదూగు పండితు లుండరే
రాజులొల్లమిఁ బైకి రారుగాక
తిమ్మరుసునఁబోలు ధీమంతు లుండరే
ధనశూన్యులని చుల్కఁ దనముగాక
శుకయోగిఁ బురణించు సుజను లిప్పుడులేరె
ధనదరిద్రులబోధ వినరుగాక
గీ. విత్తశూన్యుల కెన్నెన్ని విద్యలున్న
సుగుణములు కోటియున్నను శోభలేదు
ధనమె సుగుణంబు ధనమె విద్యయు యశంబు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 96

సీ. దైవమని శుభవ్రతముతో నర్చించు
వనితకర్థము పతివ్రత యనంగ
పతిభక్తితో జేయు పతిపూజలు పురాణ
పురుషుఁడైనట్టి శ్రీహరికి జెందు
విభుని దైవముగ భావించు సాధ్వికిఁ దోఁచు
విభునిమోమున మహావిష్ణురూపు
నారాయణుఁడుగూడ నాల్గుచేతులతోడ
సాధ్వీమతల్లికి సాగిమ్రొక్కు

గీ. నాపతివ్రత కిల నసాధ్యములు గలవె
అత్రిమునిభార్య సాక్షి సావిత్రి సాక్షి
మగఁడె దైవంబు మోక్షంబు మానవతికి
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ!

సీ. కోటిమన్మథులు నీ గోటితో సరిరారు
లోకమోహనరూప! శ్రీకలాప!
పరగ నీకాంతిలోఁ బరమాణువునుగాఁడు
చండమార్తాండుఁడో చక్రపాణి!
అఖిలలోకములు నీ యడుగుక్రిందికిరావు
నతసురవ్యూహ! యనంతదేహ!
పంచభూతములు నీవనుపున జంగమ
స్థావరాకృతిఁ దాల్చు దేవదేవ!

గీ. వట్టి భ్రమతప్ప నీగుర్తు పట్టువడదు
ఆశ్రితావనలోల! మోక్షాలవాల!
జ్ఞానశూన్యుని ననుగావు శ్రీనివాస!
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ!

సీ. నాకంటె ధనకాంక్ష నీకు లేకున్నచో
సిరిఁ దాల్పనేల లక్ష్మీశశతరి!
నాకంటె దారేచ్ఛ నీకుఁ బెద్దదిగాక
బహు భార్యలేల గోపాలబాల!
నాకున్న పుత్రేచ్ఛ నీకు లేదంటివా
శివు వేఁడనేల జేజేలఱేఁడ!
నాకంటె ప్రాణేచ్ఛ నీకు దొడ్డదిగాక
చక్రిధారణమేల సాధుపాల!
గీ. నన్నుఁ గృపఁ జూడకున్న నీ కెన్నియైన
దోసములు వన్ని తుదకు నీదాసుఁడగుచు
ముక్తి సాధింతు నీపాదములె భజించి
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 69

సీ. ఈ రేడులోకంబు లేలు వేల్పులఱేఁడ
పట్టెఁడన్నము నాకుఁ బెట్టలేవె
కాలియందు ననభ్రి గంగదాల్చినదేవ
తీయని నీరు నాకియ్యలేవె
పాంచాలి కవలీల వలువ లిచ్చినశౌరి
నాకు వస్త్రములిచ్చి సాకలేవె
యిల కుచేలుని నెవ్వఁ డోలఁగఁ దోసిన తండ్రి
సిరులిచ్చి నను గటాక్షించలేవె
గీ. పుండరీకాక్ష చే సాచకుండ నన్ను
బ్రతికినన్నాళ్లు సుఖముగా బ్రతుకనిమ్ము
పాహిమాం దీనబంధు! కృపైకసింధు!
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 100

సీ. మోముచిన్నలఁ బ్రేమ మొలపించు నొకభామ
తళుకుఁ జూపులఁ బ్రేమఁ గొలుపునొకతె
పొగరుగుబ్బల నాత్మఁ బొడుచు నొక్కమిటారి
నెనరుఁ బల్కులబాళి నించునొకతె
కటివిశాలతఁ గోర్కి గలిగించు నొకకాంత
తొడలనిగ్గుల నాత్మఁ దొలుచునొకతె
కెమ్మోవిపసఁ జిత్త మమ్మించు నొకకొమ్మ
కులుకు నవ్వులఁ బ్రేమఁ గొలుపునొకతె
గీ. పదమలాంగుల యంగముల్ మదనమోహ
రంగములు గానఁ బురుషాంతరంగములను
జూఱ గొనువారి దెసఁ దేరి జూచినంత
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 101

సీ. వేదశాస్త్రపురాణవిధులను వెలివేయు
నలఘు పండితుని వెంగలిగఁ జేయు
సింహధీరునిఁ బట్టి చెవులపిల్లిగఁ జేయు
మానాభిమానముల్ మఱుగఁ జేయు
నిరుగు పొరుగువార లీసడింపగఁ జేయు
గల్లబొల్లుల పుట్టి నిల్లునేయు
మహితానురక్త దంపతుల శత్రులఁ జేయుఁ
గర్తవ్యతాబుద్ధిఁ గాకుసేయుఁ
గీ. పరసతీరతికన్నఁ బాపంబులేదు
తుచ్ఛసుఖ మెద్దియును బొందితోడ రాదు
పరమ కళ్యాణగుణధామ భవవిరామ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 10

సీ. కూ్రరాంతకు ఫిరంగిగుండ్లుగావే పర
స్త్రీల పాలిండ్లు పూచెండులయ్యె
నరకలోకాగ్ని కుండములుగావే పరాం
గనల వాల్గనులు పంకజములయ్యె
భయదోగ్రయమభటార్భటులుగావే లాతి
చెలుల పల్కులు చిల్కపలుకులయ్యె
యమకరగ్రస్తసర్పములుగావే యన్య
తరుణుల కురులు బంభరములయ్యెఁ
గీ. బరవధూకాంక్షకలనైనఁ బడయనట్టి
యనఘుఁడే భీష్ముఁ డతఁడె శ్రీఆంజనేయుఁ
డతఁడె శుకయోగి యని యందు రార్యజనులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 103

సీ. గబ్బిగుబ్బలు జూచి యుబ్బిపోవునుగదా
మాంసఖండము లన్న మర్మమెఱిఁగి
వాలుగన్నులుఁజూచి వలచి సోలునుగదా
పుసుల తొఱ్ఱ లటన్న మూలమెఱిఁగి
కెంపువాతెఱఁ జూచి కెరలి కుల్కునుగదా
చొల్లుసేపు రహస్య మెల్లయెఱిఁగి
బాహుమూలము జూచి భ్రాంతి జెందునుగదా
చెమట కంపునుగొట్టు క్రమమెఱింగి
గీ. గళము చందముఁ గని చాల వలచునుగద
శ్లేష్మకూప మటంచు నీతిని నెఱింగి
ప్రకృతిమోహంబు మనుజుండుఁ బాయలేడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 104

సీ. నలకూబరున కేమి న్యాయదాంపత్యంబు
రాణించి రంభతో రతులుమరిగె
నెవఁడు కన్యాదాన మిచ్చి కొల్గడిగె మే
నకను గొమ్మని గాధినందనునకు
వేల్పుటింతులఁ బెద్ద పేరైన యూర్వశి
నేమి పెండ్లాడి సుత్రాముఁడొందె
నగ్నిసాక్షిగఁ బెండ్లియాడెనే యప్సరోం
గనలఁ బొందఁగ మాందకర్ణిమౌని
గీ. పుడమివేల్పులు వేల్పులు మునులుగూడ
పరవధూమణిపై భ్రాంతిఁ బాయలేరు
దాని గెల్చినవారెపో ధన్యమతులు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 105

సీ. అంగనాసరసప్రసంగముల్ వలదంచు
శ్రీరంగనీతులుఁ జెప్పవచ్చు
కరిరాజగమనపై సిరిఁ జూడరాదంచు
కనుల గంతలు గట్టుకొనఁగవచ్చు
నంబుజాక్షులపల్కు లాలింపరాదంచు
శ్రుతిరంధ్రముల దూదిఁ జొనుపవచ్చు
కంపాలతాతన్విసంపర్క మఘమంచు
మేటిగ్రంథములు నిర్మింపవచ్చు
గీ. నాకపడి హెచ్చరించి ఫుల్లాబ్జముఖులు
మెత్తపడి డాయ నెవ్వాఁడు చిత్తమందు
నిగ్రహముఁ దాల్చు నతఁడె పో నీతిపరుఁడు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 106

సీ. వలచు నూర్వశితోడ గలయంగ నరిగెనే
యర్జునుం డురుతమోహవర్జనుండు
దేవసుందరి వరూథిని కోరె నని మించి
హర్షించి ప్రవరాఖ్యుఁ డంటుపడెనె
చిత్రాంగి బలిమిమై చెయిఁబట్టి లాగంగ
భంగంబు పడెనె సారంగధరుఁడు
చాల వేఁడినరంభ సంతోషపఱచెనే
యాశమాలినయట్టి శ్రీశుకుండు
గీ. ననుచు వీరి మహత్వంబు లాత్మదలఁచి
పరవధూరత్నములు కంట బడెడివేళ
పురుషుఁ డగువాఁడు చలనంబుఁ బొరయరాదు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ. 107

సీ. మోహినీస్త్రీరూపమునుఁ జూచి వలచునే
సర్వజ్ఞుఁ డగుమహాసాంబశివుఁడు
ధర్మస్వరూపుఁడై తగువిష్ణుదేవుండు
బృంద కౌగలి కాస జెందు నొక్కొ
జేజేలపెద్దయై సృష్టిఁజేయు విధాత
శీతాద్రికూతుపైఁ జిత్త మిడునె
మునిపత్నియగు నహల్యను బొందఁ గడఁగునే
వేయికన్నులవాఁడు వేల్పుతేఁడు
గీ. కామబలమును వర్ణించు కథలుగాక
వేల్పుదొర లేడ పరసతీప్రేమయేడ
రాఘవకవీంద్రపోష శ్రీరామవేష
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 108

సీ. కనుసన్నలను బరాంగనలఁ బిల్వఁగఁగాదు
కను లిచ్చినది శ్రుతుల్ గనుటకొఱకె
సాధు సజ్జనపీడ సమకూర్చుటకుఁగాదు
బల మిచ్చినది తపఃకలనకొఱకె
భువి బాతిపెట్టి తా దివి కేగుటకుఁగాదు
సిరు లిచ్చినది యీవిసేయుకొఱకె
యితరభామినుల పాలిండ్లు బట్టఁగఁగాదు
చే యిచ్చినది నీదు సేవకొఱకె
గీ. భూతదయ వావివరుసలు నీతిఁ దప్పి
ప్రజలు మారిరి పాపాలభైరవులుగ
పుణ్యము నశించెఁ గలి పరిపూర్తిఁ జెందె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 109

సీ. వయసు తీరినమీఁద వానరాకృతి సుమీ
భువనమోహినియైన పువ్వుఁబోఁణి
వయసువాడినమీఁద వఱదు నక్కగుఁ జుమీ
చేత నేనుఁగు నెత్తు సింహబలుఁడు
పృథుయౌవనము చన్నఁ బిచ్చివాఁ డగుఁ జుమీ
భువి బృహస్పతి గేరుబుద్ధిశాలి
ప్రాయమూడినమీఁదఁ బరతంత్రుఁ డగుఁ జుమీ
కోరి బ్రహ్మను లెక్కఁగొననిమేటి
గీ. నేటిప్రాయంపుజందముల్ నిక్క మనుచు
నిక్క నీల్గుచు నిన్ను ధ్యానింపలేరు
యముని కొఱతకుఁ బాలౌదు రజ్ఞజనులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 110

సీ. తమజాతితో దక్క ధర నన్యజాతితోఁ
బశుపక్షులకుఁ గానబడవు రతులు
తమజాతి కగు పదార్థము దప్ప పశుపక్షు
లితరజాతుల తిండి యెఱుఁగ వెపుడు
యేర్పడ్డ రుచులలో నిల రమించుటెగాని
పశుపక్షులకు సదా పరత లేదు
తమజాతికగు సముద్గతగుణంబులు దక్క
పశుపక్షులకు లేదు పరగుణంబు
గీ. పశులు సేయని హేయంపుఁ బనులుసేయు
ప్రజలె నిజమైన పశువులు పక్షు లరయ
నేమి జదివిరో పోఁగాల మేమి కలదో
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 111

సీ. వన్నెవాసియు లేక వన్నెచీరలుగట్టు
వనజాయతాక్షి మువ్వన్నెమేకము
సద్వర్తనము లేక చదువు లేకఁ బెట్టు
పండితమ్మన్యుండుఁ బలుకుఁజిలుక
భక్తి సుంతయు లేక పంగనామము దిద్దు
మంచి వైష్ణవుఁడు నామాలచెరుకు
కరుణారసము లేక కాంచనచ్ఛలి మించు
మోహానాంగులు చేదుముషిడిపండ్లు
గీ. జ్ఞాన మంటక సాధుసజ్జనుల వెంట
గలసి చనువాఁడు బూదిలో గచ్చకాయ
అంబుజోపమనయన క్షీరాబ్ధిశయన
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 112

సీ. ముజ్జగంబులబారి ముక్తిదాయిని యైన
గగన స్రవంతినిఁ గనియె నెద్ది
శిలరూపమున నున్న యల యహల్య నతుల్య
మహిమ నాతిగఁ జేసి మనిచె నెద్ది
బలిదాన మొందుచో వామనత్వము దాల్చి
మిన్ను నిండుఁగ నాక్రమించె నెద్ది
కాళీయఫణముపై బ్రాలి చిందులు ద్రొక్కి
విషరాశి గ్రక్కించి విడిచె నెద్ది
గీ. భక్తులకు ముక్తిమార్గమై పరఁగు నెద్ది
శ్రీరమాదేవితోఁ
యట్టి నీపాదమునకు సాష్టాంగ మిదిగో
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 113

సీ. వెల్లదామరసిరుల్ వెలుఁగు గన్నులవాడ
యూర్ధ్వపుండ్రపు సిరు లొలుకువాడ
నవచంద్రికల గేరు నగుమోము సిరివాడ
గరుఁడు నెక్కిన మేటి సిరులవాడ
కౌస్తుభమణి సిరుల్ గల పెన్నురమువాడ
కేలిచక్రము సిరుల్ గెరలువాడ
నీలమేఘముడాలు నించు మైసిరివాడ
శేషతల్పపు సిరుల్ జెలఁగువాడ
గీ. శ్రీజగన్నాథ సకల లక్ష్మీసనాథ
నిగమ వాచామగోచర నిర్విచార
ప్రణతమందార ననుగావు భవవిదూర
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 114

సీ. ప్రాభవోన్నతిమీరు రారాజు మృగరాజు
కడు యుక్తిపరుఁడు నక్కలకు ఱేఁడు
స్థూలగాత్రమువాఁడు సూకరంబులతోడు
శృంగారతరవేషి గంగిరెద్దు
యాస్యాసుఖముగోరు నాతఁడే నగరాజు
స్త్రీభోగలోలుండు తేనెటీఁగ
మధురవాగ్వైభవుండు మహిని కోయిలపుల్లు
వటుజటా సంధారి వండు మఱ్ఱి
గీ. యనుచు వీరలురోసి సత్యమును భక్తి
జ్ఞాన వైరాగ్యము గల్గు సాధువులకు
మోదమునఁ గౌగిటకుఁ జిక్కు ముక్తికాంత
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 115

సీ. అత్తిలి వంకాయ యని భ్రమింపఁగవచ్చు
బూటకంబగు వేశ్య మొగము మెఱుఁగు
కనుఁగప్పి మాయమౌ కార్మొఱుంగనవచ్చు
విటులపైఁ బ్రసరించు వేశ్యవలపు
కడఁగి చేపలఁబట్టు గాలం బనఁగవచ్చు
వేశ్యాకాంతల చేతి వీడియంబు
కాలసర్పము కూయు కప్పకూ తనవచ్చు
వారకాంతల వింత భాషణంబు
గీ. యిట్టి వెలయాండ్రకెల్ల పై మెట్టులగుచు
సంచరించెడి సంసార జారసతుల
నట్టి దూషణలిచ్చి చీకొట్టువాఁడ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 116

సీ. చెరువునీట జరించు చేపలఁ గడతేర్ప
మిక్కువాల్చి బకంబు పొంచినట్లు
బెకబెకధ్వనిసేయు భేకలోకముఁ బట్టఁ
బ్రిక్కపక్కల పాము నక్కినట్లు
రహిఁ బచ్చికబయళ్ల విహరించు లేళ్ల కై
పొగరుఁబెబ్బులి బైటఁ బొంచినట్లు
కిలకిల ధ్వనిసేయు నెలుకల పనిఁబట్ట
నెదురు జూచుచు పిల్లి మెదలునట్లు
గీ. తిరుగులాడుదు రట్టిట్లు దినదినంబు
నక్కటా ! కర్మవశమునఁ జిక్కినట్టి
విటుల మావంగఁ జూతురు వేశ్యలెల్ల
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 117

సీ. వేశ్యవాతెఱ చొల్లు పెరుమాళ్ల తీర్థమా
విటభాగవతు లొక్క గుటకమ్రింగ
వేశ్యయిచ్చుక మెల్ల వేదాంతబోధమా
విటులు బ్రహ్మానంద విధిఁజెలంగ
పడుపు కాంతను గంట పరమాత్మఁ గాంచుటా
సరసు లీలోకంబు మఱచియుండ
వెలయాలి పదపాళి పెరుమాళ్ల పదములా
సరసు లాసించి సాష్టాంగపడఁగ
గీ. మాయతుంటరి టక్కరి మంకుపొగరు
జబ్బు నెవ్వగ నెఱకొక్కు సానికొఱకు
నాలుబిడ్డల విడనాడి యవయ నేల
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 118

సీ. ముక్కు దిబ్బడవేసెఁ జక్కని నాసామి
యూరకుండు మటందు రొక్కనాఁడు
చుట్టాలు వచ్చిరి ముట్టరాకుర సామి
యూరకుండు మటందు రొక్కనాఁడు
తిండి మిక్కిలి తింటేఁ దెలిపి లేదురసామి
యూరకుండు మటందు రొక్కనాఁడు
పట్టిమంచము నేయఁ బంపియుంటిర సామి
యూరకుండు మటందు రొక్కనాఁడు

గీ. వేయి కన్నులుగల యట్టి విటులకైన
వేశ్యకాంతల మటుమాయ విశదమగునె
కాలనేమికిఁ జెల్లెండ్రు గణికలెల్ల
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 119

సీ. రాధికాస్వాంతంబు రచియించు టనుగదా
పెద్ద కీర్తి గణించె ముద్దుపళని
గాన మాధురిచేత గద ప్రాకె బెంగుళూర్
నాగరత్నము కీర్తి నాల్గుదెసల
పాటసొంపున గదా భరతఖండమునందు
గొప్ప గౌరవమందె గూర్జహాను
పాటనేర్పున గదా బహురాజసభలలో
బేరెక్కె గోయంబతూరు తాయి

గీ. వీరలందరు వేశ్యలుగారె ధనము
యశము నార్జింపరే గౌరవాస్పదముగ
విలువమాలిన భోగంపు వృత్తియేల
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 120

సీ. జీవితేశుఁడు లేని చెలి గుబ్బపాలిండ్లు
శాంతమింతయు లేని జపముఁ దపము
దానధర్మము లేని ధనధాన్యవిభవంబు
పాలచుక్కలు లేని పసులపొదుగు
సాధువర్తన లేని సకియ యొయ్యారంబు
పూచికాయని వెఱ్ఱి భూరుహంబు
పటువివేకము లేని పాండిత్యగరిమంబు
వలపుమాలిన వధూవరుల బ్రతుకు
గీ. లేశమైనను తిలకంబు లేని మోము
వీనులకు విందుసేయని వెఱ్ఱిపాట
వాసికెక్కదు వసుధపై వాసుదేవ
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 121

సీ. అణురూపుఁ డగుటచే ఫణిరాజతల్పుండు
బాహ్యదృష్టులకుఁ జూపట్టఁ డేమొ
నిఖిలంబుఁ దానయై నిర్గుణుం డగుటచే
బోల్పంగఁ బడఁడొ వేల్పులకు వేల్పు
అప్రాకృతుం డౌట నణిమాది రహితులౌ
నరులచేతికి విష్ణు దొరుకఁడేమొ
భక్తరక్షణకళాభారంబు మదినిండి
పిలచినఁ బలుమారు పలుకఁడేమొ
గీ. విశ్వమయుఁ డిందిరాభర్త విశ్వకర్త
ఆది మధ్యాంతరహిత నారాయణుండు
లేనితావులు లేవండ్రు మానివరులు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 122

సీ. గతిమాలి సతినమ్మి కాటికాపుర మొప్ప
సంతాపపడె హరిశ్చంద్రవిభుఁడు
వైదేహిఁ గోల్పోయి వనటచే గుందఁడే
రఘువంశమణియైన రామవిభుఁడు
సతిఁ దోసి కూటికై ఋతుపర్ణునింటిలో
వంటఁ జేయఁగలేదె వగచినలుఁడు
అనుజన్ములను గూడి యడవి పాల్పడి ఘోర
దారిద్ర్య మొందఁడే ధర్మరాజు
గీ. కష్టములులేని బ్రతుకులు గానరావు
బ్రహ్మయైనను నరజన్మ వడసెనేని
ప్రకృతికి నిబద్ధుఁడై బుద్ధి వికలుఁ డగును
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 123

సీ. నరులు మోక్షార్థులై పరిణయంబులు మాని
సన్యసించిరయేని జనము తఱిగి
సృష్టికి మూలవిచ్ఛేదంబు సమకూరుఁ
గాన మానులు పుత్రహీను లగును
పున్నామ నరకమం చెన్ని వ్రాసిరిగాని
దైవేచ్ఛలేక సంతాన మొదవ
దడలి పుత్రహీను లంగలార్వఁగనేల
నీ పాదయుగళంబు నెఱిభజించి
గీ. నరకమును దోసి యవ్యయానందులగుచు
జాలఁ గొనవచ్చు స్వర్లోక సుఖములెల్ల
నంబుజోపమనయన క్షీరాబ్ధిశయన
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 124

సీ. అభ్రంకషం బైన హార్మ్యాగ్రమున నున్నఁ
గొండలోపల దూరి పండుకొనిన
ఘోరాటవుల మధ్య జేరి కాపురమున్న
వనరాశిమధ్య నివాసమైన
మేలైన కవచంబు మెయినిండ దొడిగిన
దేశాంతరము పోయి దిరుగుచున్న
పాతాళలోకంబు బ్రాపించి మెటనున్న
కోటలో ముప్పొద్దుఁ గూరుచున్న

గీ. కిటుకుఁ గనిపెట్టి మృత్యు వచ్చుటికె వచ్చు
చావుఁ దప్పించుకొనువారు జగతిగలరె
జనన పర్యవసానంబు చావుగాదె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! • 125

సీ. రాజాధిరాజమార్తాండు డైననుఁ జచ్చి
వెదురుని చ్చెన మీద వెడలవలయు
మణిహేమ భూషణాంబర మాల్యధరుఁడైనఁ
జితిమీద నగ్నుఁడై చేరవలయు
కోటిసైన్యము గల్గు కువలయేశ్వరుఁడైన
నేకాకియై దివి కేగవలయు
కవికి బల్కులఁబల్కు కవి శిరోమణియైన
మూఁగయై చితిమంట వేగవలయు

గీ. రాగియు విరాగి భోగియు జోగి ద్విజులు
శూద్రులును బండితులు నజ్ఞులంత లనెడి
యంతరము లేదు శవముల కన్ని సమమె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 12[illegible]

సీ. మదగజేంద్రము నెక్కి మానవాధిపుఁడైన
భూచక్రి మేలెడి భోగియైన
పంచభక్ష్యాన్నముల్ భక్షించు ఘనుఁడైన
మణిసౌధములనుండు మాన్యుఁడైన
తతమంజులారామ యుతభోగపరుఁడైన
పసిఁడి యుయ్యేలలూఁగు రసికుఁడైన
వరహేమమణిమయాభరణభాసితుఁడైన
భూరిభర్మదుకూల ధారియైన
గీ. బ్రిబలగర్వముచేఁ బొంగిపడుటె కాని
యెట్టి యైశ్వర్యమయుఁడైన హీనునట్ల
యనుభవించును మరణవేదనలు తుదకు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 127

సీ. కడఁగొట్టు సుతునిపై కాంక్ష నాకిది యేల
భార్యతో నాకు సంబంధ మేమి
యిల్లువాకిలితోడ నేటిమోక్షము నాకు
నీ.దుఃఖకరభూతి యేల నాకు
నెన్నఁడైన వియోగ మున్న స్నేహితులేల
నిహసుఖంబు ముముక్షు వేలవలచు
నేకజీవున కేడ యితర బాధుజనంబు
లీ కళేబర మడ్డమేల నాకు
గీ. ననుచు బంధులపై మోహ మణఁచి జీవుఁ
డరుగుచును బొటి వెచు దేహంబుఁ జూచి
వగచుచుందురు వెఱ్ఱులై బంధుజనులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 128

సీ. కన్నబిడ్డలమీదఁ గారుణ్య మేమాయె
బొందిలోపలి గాలి పోవునాఁడు
బహుళసంసార తాపత్రయం బేమాయె
యమదర్శనము సేయు సమయమందు
మాది మాదనునట్టి మహాకార మేమాయె
నుక్కి మృత్యువునోటఁ జిక్కునాఁడు
శుభభోగములమీద నభిలాష మేమాయె
సర్వేసు నాజ్ఞయై చనెడువేళ
గీ. మిత్రబంధులపైఁ బ్రేమ మేమియగునొ
కన్నుమూయుచు దివికేగు చున్నవేళ
నీశ్వరుని మాయ దెలియంగ నేదిమేర
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 129

సీ. అడలి యేడ్చెడిభార్య నరగంట వీక్షింపఁ
డారగింపఁడు షడ్రసాన్నములను
చేయూరఁ బెంచిన చిన్ని కుఱ్ఱలఁజీరఁ
డిల్లు వాకిలిమీద హితవుగనఁడు
కట్టుకొమ్మని పట్టుపుట్టంబు నర్పింపఁ
గరము సాచఁడు దిగంబరము మరఁగి
కనకాభిషేకంబుఁ గావించినను కన్ను
విప్పిచూడఁడు మోముఁ ద్రిప్పివైచి
గీ. శవములకు వాంచితార్థముల్ జగతిలేవు
బాంధవము లేదు ద్వేషభావములు లేవు
దేహ మున్నంతవరకె యీ దేవులాట
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 130

సీ. మునువశిష్ఠుని జ్ఞానఘనత యెక్కడఁబోయె
నిజపుత్త్రశతకంబు నిధనమొంద
రామచంద్రుని ధైర్యరమ యెచ్చటికిఁ బాఱె
మును లక్ష్మణుండు మూర్ఛను మునుంగ
శంభుగెల్చిన ధనంజయు బీర మెటకేఁగె
నభిమన్యుఁ డాజిలో నంతరింప
దశకంధరుని మనోధైర్య మెక్కడమాసె
నని నింద్రజిత్ప్రాణ మణఁగిపోవ

గీ. జ్ఞాననిధులని పేర్వడ్డ మానులైన
బంధు నాశనదుఃఖంబు మలసియుండు
మాయలోనని దుఃఖంబు మలసియుండు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 131

సీ. ఏడుదీవులు గెల్చి యేలిన షట్చక్ర
వర్తు లప్పుడె మృత్యువాతఁ బడిరి
భగవత్స్వరూపులై నెగడు శంకరముఖ్య
మతగురూత్తము లెల్ల మాయమైరి
ఉట్టి గట్టుకొని తా రూరేగనుంకించు
ప్రాణలోభులు మిత్తిపాలఁబడిరి
పుత్త్రపౌత్త్రులఁ బ్రేమఁ బోషింపఁగాఁ జూచు
తాతతండ్రులు నాఁడె దగ్గమైరి

గీ. కాటికేఁగిరి మూఁడు యుగములవారు
దేహధారికి బ్రతుకెందుఁ దిరముగాదు
గాన పరమార్థ మార్జింపఁ గడఁగవలయు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 132

సీ. సర్వసర్వంసహా చక్రంబు శాసించు
జగజెట్టి గని మిత్తి జడియబోదు
కాళిదాసాది సత్కవుల వర్ణన క
మృత్యుదేవత బుద్ధి మెత్తవడదు
సిద్ధమంత్రము లెంత శ్రద్ధతోఁ జదివినఁ
బాఱిపోవదు మిత్తి భయముహాతి
కొండమెత్తున మేటి కుంభముల్ వోసిన
మనుప దొక్కనినైనఁ జెనటిమిత్తి
గీ. మృత్యువును గెల్చు విద్యలీపృథివి లేవు
తిరిగి పుట్టకయుండుటే యెఱిగి మృత్యు
విజయమయ్యెడె మోక్షంబు విబుధతతికి
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 133

సీ. స్నేహసంపర్కంబుఁ జేయు నాటిసుఖంబు
హిత దుర్వియోగమై యేచునాఁడు
ప్రేమానుబంధంబు పెంచుకొన్న ఫలంబు
ప్రాణబంధులు నాశమైననాఁడు
ధనము గల్గిననాటి ఘనమదాంధత్వంబు
తిండిఁగానక వస్తుఁ బండునాఁడు
ప్రాప్తయౌవనమందు వ్యభిచరించు పసందు
బలవిహీనత మూలఁ బడిననాఁడు
గీ. శాస్త్రమనని యార్యులకు లోటుఁ జాటుపొగరు
తన్నుకూతురు ఱంకాడు చున్ననాఁడు
కొందలము జెందు దనబుద్ధిఁ గూర్చినరుఁడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 134

సీ. సుఖదుఃఖములయందు సురుగకెంతయు బ్రేమ
సాయమయ్యెడు వాఁడె సఖుఁడనంగ
దనమనోనాథుఁ డెంత యనామకుండైన
పరిణుతించు భామయే భార్యయనఁగ
నన్నయానతిఁ బూని యెన్నండుఁ బొరలేక
తరలిపోవనివాఁడె తమ్ముఁడనఁగ
జనకాజ్ఞకెపుడు యక్షప్రశ్న వేయక
తలధరించెడివాఁడె తనయుఁడనఁగ
గీ. బెండిలికి రాకపోయి తప్పించుకున్న
నెనరు మీఱంగ జని సపిండీకరణము
నందుఁ గూర్చున్నవాఁడె పోబంధుగనఁగ
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 185
సీ. విటులశయ్యకుఁ దార్చు వేశ్యకైనను ముక్తి
నిమిషంబు హరిని ధ్యానించెనేని
కటికివానికి గూడ కైవల్యమబ్బు మే
కల గోయుచో విష్ణు దలఁచెనేని
సంసారులకుఁ గల్గు జన్మసాఫల్యంబు
చిత్తంబు శివునిపై జేర్చిరేని
మెల్లపేదలకబ్బు నిహాపరంబుల సౌఖ్య
మెలుగెత్తి గోవిందుఁ బిలచిరేని
గీ. కలఁడు భగవంతుఁడను నమ్మకంబె చాలు
ప్రజలకెల్లను భృత్యుఁడై పరఁగు శౌరి
యని భజింతురు నీభక్తులైన జనులు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 186

సీ. పేదసాదలకుఁ దృప్తిగ నన్నమిడు పుణ్యుఁ
డమృతంబు భక్షించు నమరపురిని
తృష్ణార్తులకు దప్పిఁదీర్చు పుణ్యుఁడు స్వర్గ
గంగాజలంబు ద్రావంగఁగలుగు
గోదానమొనరించు గుణగరిష్ఠుఁడు ద్రాగు
నాలోకమున వేల్పు టావుపాలు
గృహదాన మొనరించు మహితపుణ్యుఁడు జెందు
వైకుంఠపురగేహ వైభవంబు
గీ. నిచ్చట దృణంబు నిచ్చిరయేనిఁ బరము
నందదే మేరువై మోక్షమర్థినిచ్చు
వితరణములేని సిరితీరు విధవసౌరు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 137

సీ. చక్రవర్తికి పుత్రసమ్మోహ మెట్టిదో
మాలవానికిఁ బుత్ర మమతయంతె
పట్టంపురాణిపై పతికెంత తగులమో
యాలిపై నిఱుపేద కంతెవలపు
సుఖవైభవములు రాజుల కెంతప్రియములో
యత్యల్పులకు గూడ నంతెప్రియము
విమలవిఖ్యాతి కోవిదుఁ డెంతకోరునో
నోరుమాలినవాఁడు గోరునంతె
గీ. సిరియు విద్యయు లేనట్టి నరులకైన
ప్రేమలకు గోర్కెలకు లేదు పేదతనము
తలఁచి చూడఁగ నాన లందఱకు సమమె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 138

సీ. అధికారసౌభాగ్య మంతరించినచోటఁ
గనులు రెండును పోయి కలఁగుచోట
దిరిపెమెత్తినసైనఁ దిండి గల్గనిచోట
ప్రియవియోగంబుఁ బరఁగుచోట
గనకంబుఁ జేముట్టఁ గడఁగి మున్నగుచోటఁ
గలకాలమును వ్యాధి గ్రిమ్ముచోట
జేతికందిన తనూజాతు లీల్గినచోట
సుతలెల్ల విధవలై సుక్కుచోట
గీ. నట్టి నాస్తికులకునైన నీశ్వరుండు
గన్నులకుఁ గట్టినట్లుగాఁ గానుపించు
గడకు నిల్చెడి నాస్తికుల్ పుడమిఁగలరె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 139

సీ. ఎండిపోయిన వృక్ష మిపురొత్తు నొకవేళ
నొకవేళ బెనువృక్ష మొఱగివచ్చు
చెల్లిపోయినవాఁడె జీవించు నొకవేళ
నొకవేళ గజసత్వ డుక్కుమడఁగు
పండఁబాఱిన చేను పడిచచ్చు నొకవేళ
నొకవేళ బానేల యోడబండు
క్షితినేలు రారాజుఁ జేఁసాచు నొకవేళ
నొకవేళ దరిద్రుఁ డుర్వినేలు
గీ. నేది యెటులౌనొ మనుజుల కెఱుకపడదు
కాకమానదు కానున్న కర్మఫలము
సర్వమును నీకృతంబుగా జరుగుచుండు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 140

సీ. తలను దాల్చినకుండ ధరణిపై బడకుండ
విపులనాట్యము సేయు వేశ్యబోలి
కడుపునంటిన పిల్ల పుడమిపైఁ బడకుండ
కుప్పిగంతులువేయు కోతిరీతి
దారతోడను నేక తల్పమందును జేరి
వేశ్యపై తమినిల్పు విటునిపగిది
నింటఁ గట్టిన లేగ నెదదలంచుచు బైటఁ
దృణము మేయు ప్రసూతధేనువట్లు
గీ. శ్రీమహావిష్ణునాత్మలోఁ జిక్కనిలిపి
జనులు సంసారములు జేసుకొనుచు ముక్తి
నందగావచ్చు నని పల్కి రార్యజనులు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 141

సీ. కన్నుసన్నలఁ బరాంగనలఁ జేరుటగాదు
ముక్తికాంతను రక్తి ముంచవలయు
కుక్షింభరతచేత క్రొవ్వి యూరుటగాదు
మించి పేదలను పోషించవలయు
చలపట్టి విద్వేషి జనులఁ జంపుటగాదు
కామాదిషట్కంబుఁ గాల్చవలయు
గన్నబిడ్డల బ్రీతిఁ గౌగలించుటగాదు
సకలభూతదయార్ద్రి సమతవలయు
గీ. దెలిసి యాలీలవర్తించు ధీరులకును
కరతలామలకంబుగాఁ గలుగుఁ జుమ్మె
ఐహికాముష్మికాతి సౌఖ్యానుభూతి
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 142

సీ. జనుల విత్తముచేత సత్రమ్ము గట్టించి
తన యిష్టులకొసంగ ధర్మమగునె
పరుల విత్తముచే నుపాధ్యాయుఁ బోషించి
తనపిల్లలకు నేర్పు మనఁగఁదగునె
సంతర్పణముపేర సంతరించినసొమ్ము
తనపొట్టలో వేసికొనఁగఁదగునె
పురజనుల్ జేయించు భోగప్రసాదంబు
ధర్మకర్త హరింప ధర్మమగునె
గీ. యొరులసొమ్మునఁ గట్టించు నూరరచ్చ
సావడిని దన పసుల నుంచఁగఁదగునె
గొప్పవారల కిట్టి కక్కుఱితి దగునె
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 143

సీ. కడిఁదిఁ బెండిలి కర్మకన్నఁ బెద్దదిగాఁగ
పృథివిపై వెలయదే ప్రేతకర్మ
భోజనం బొనరించు ముఖముకంటెను బ్రీతి
గడుగుచుండఁగ లేదె యడుఁగుదోయి
వినయ శీలునికన్న వేయిపర్యాయముల్
వేడుచుండఁగ లేదె వినయశూన్యు
నొగి నిరామయుకన్న నుపచారములు పెక్కు
బడయుచుండడె రోగ బాధితుండు
గీ. త్యాగగుణమబ్బు సన్మార్గభోగికన్న
దొడ్డకలిమిని బొందఁడే దుష్టలోభి
యిట్టి యున్నతిజూచి హర్షించుటెట్లు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 144

సీ. గడగడవడకించి కసరికొట్టు గయాళి
పెండ్లాములకు జేజెపెట్టువారు
కానికార్యము లెన్నొ కన్నారవీక్షించి
సైచిచూడని భంగిఁ జనెడివారు
కులమతాచారంబు దలఁగి పందులఁబోలె
మాలమాదిఁగ కూడు మరగువారు
అష్టకష్టములపాలై తమ్ముఁ బెంచిన
తల్లిదండ్రుల చావుఁ దలచువారు
పరము లేదనిసాటి గురుదేవశూన్యులై
తల్లికి మగలౌచుఁ దనరువారు
గీ. క్రూరకర్ములు ద్రోహులుఁ గుటిలమతులు
వర్తమాన మునీంద్రులై వఱలినారు
వారిమాటలె పాటింత్రు కోరిఖలులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 145

సీ. ఋతుకాలమందు వేరుగదొలంగిన యంత
వింతమాలెత యౌను విప్రకాంత
కాకిగూటను కొంత కాలమున్నంతనే
కాకమౌను వసంత కోకిలంబు
పనిలేక పడగవిప్పక పరుండిన యంత
క్షితి వానపామౌను శేషభోగి
ధూళిచే మలినమై ద్యుతి మాసినంతనే
మసిబొగ్గు తీరౌను మానికంబు
గీ. పొట్టగడవక దడవుకో బట్టి ద్విజులు
ధర్మములు వెల్లడింపక దాగవలసె
పుట్టుతోడనె పావనుల్ భూమిసురులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 146

సీ. పద్మాయతాక్షికిఁ బ్రీత్యాస్పదై వంబు
    ప్రాణనాథుఁడు గాని పరుఁడుగాఁడు
తోయజాక్షికి బొందిలో లభించెడి స్వర్గ
    మత్తిల్లుగాని యన్యంబుగాదు
బింబాధరికిఁ శోభఁబెంచు సింగారంబు
    మగనిసేవయెగాని నగలుగావు
కలహంసగమనకుఁ దులలేని విభవంబు
    విభుని నెయ్యమెగాని విద్యగాదు
గీ. మానినీమణికిని మారుమనువులేదు
సతులవిడనాడు పతులకు గతులులేవు
పోసికొనరాదు బుధులు ప్రాబోండ్లయుసురు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 147

సీ. పుడమివిప్రుల మూలపురుషులందరు మహా
    మునులు దివ్యజ్ఞానఘనులు నిత్య
సత్యవ్రతులు సర్వసములు వేదోక్తధ
    ర్మపరాయణులు స్వార్థరహితమతులు
సకలభూతదయార్ద్రసన్మానసులు వారి
    బీజాంశమున నుద్భవించినట్టి
తరతరంబుల జనుల్ దైవభక్తులు జీవ
    హింసాది పాపదుష్కృతుల గనరు
గీ. యితరకులబీజమునఁ బుట్టి యెవ్వఁడైన
విప్రుఁడగు టెట్టులో దాని వివరమేమొ
దేవతాప్రీతి జనకంబు ద్విజకులంబు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 148

సీ. గార్ధభాశ్వము లొక్క కరణిఁ గన్పట్టవే
కోకిలచ్ఛాయ కాకులకు లేదె
ఉల్లిమల్లియలు నన్యోన్యంబుఁ బోలవే
కరివరాహము లొక్క సరణిలేవె
మృగరాజువలె తోక తగ నక్కలకు లేదే
పాలియదే గోవుపగిది బఱ్ఱె
నెమలిపిట్టల భంగి నెఱిగోళ్లు నడువవే
కాకి బంగరులేదె కనకమట్లు
గీ. అంతమాత్రమ్మునఁ బరస్పరాంతరమ్ము
పోలియదెప్పుడుఁ బరుఁడు విప్రుండుగాఁడు
భూసురకులంబునకు లేదు పుట్టుమచ్చ
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 149
సీ. ఆడినమాట లేదనెడి గాడిదజిహ్వ
రెండు వాలికలుగాఁ జెండవలయు
నకలంకులనిన పండ్లికిలించు చెడుకోఁతి
మూతిని సుత్తితో మొత్తవలయు
బరుల సంపదను సైఁపఁగలేని పెద్దమ్మ
కనుదోయి కొఱవితోఁ గాల్చవలయు
పరనింద లాలింపఁ గర ముల్లసిలుకూళ
చెవుల సీసముఁగాచి చిలుకవలయు
గీ. నుల్లసముమీఱ దాననాహూత యగుచు
నితరులకు హాని జేయంగ నేగుచున్న
దుష్టమతిపాదయుగ్మంబు ద్రుంచవలయు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 150

సీ. ఆకాశరూపివై పావణిల్లుటకు సాక్షి
దూరదృష్టికి ననంతుఁ డవుఁగాన
జలరూపధారివై చరియించుటకు సాక్షి
నీపదంబున గంగ నెగఁడెఁగాన
పృథ్వీస్వరూప సంభృతుఁడ వౌటకు సాక్షి
యరయ భూదేవి యర్ధాంగిగాన
వాయుస్వరూప ధూర్వహుఁడ వౌటకు సాక్షి
భూతపాలనము సల్పుదువుగాన
గీ. జ్వలనరూపుండ వనుటకు సాక్షినీదు
విగ్రహము హాటకచ్ఛవి వెలుఁగుఁగాన
పంచభూతము లీవ ప్రపంచమీవ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 151

సీ. శతకోటి భాస్కర ద్యుతిమించు నీకాంతి
మీనకేతను నవ్వు మేనిజవ్వ
నీలోతు నెఱుగంగ నేరఁ డంబుధిరాజు
కులము పరబ్రహ్మ కులము నీది
వేదవర్ణనమీఱు నీదు తత్వముసారు
ధాతపాలిటఁ జన్మ దాతవీవు
ఐశ్వర్య మెదురిచ్చి యాదరింతువు వజ్రిఁ
బ్రార్థనీయుఁడవు సప్తర్షులకును
గీ. యిన్ని ఔన్నత్యములు నీకె యున్నకతన
మునులు మెచ్చి పరాత్పరుం డనిరినిన్ను
భక్తజన కల్పదీనుల పాలివేల్ప
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 152

సీ. రఘురామకారుణ్య రసవియద్గంగలోఁ
గాని పాయదు మనఃకల్మషంబు
ఆత్మార్పణంబు శ్రీహరికిఁ జేసినఁగాని
ముచ్చటింపదు కొంత ముక్తికాంత
హృదయస్థ వైకుంఠు నెఱుఁగకుండఁగ త్వమే
వాహమ్మనఁగఁ దెల్లమగుట కల్ల
తాపత్రియంబుఁ జిత్తమున వీడినఁగాని
బుద్ధిపట్టదు భవాంభోదిగట్టు
గీ. జగము నాటకమాడించు చక్రిధరుఁడు
వేసముల్ పదివేసిన వెన్నదొంగ
దొంగభక్తికిఁ గలనైన లొంగఁడండ్రు
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 153

సీ. కొంగజపంబుచే గోచరింపఁడు దొంగ
జోహారులకుఁ బ్రేమఁ జూపఁబోడు
ఊర్ధ్వపుండ్రముఁ జూచి యుబ్బి దర్శనమీడు
పొంగలి పులిహోర మ్రింగిరాడు
కుటిల సన్యాసుల జటలలో నటియింపఁ
డెగుడుఁ జూపులఁ జెంత కెగిరెరాడు
కాకికైవడి నొడల్ గంగముంచిన గావఁ
డోంహ్రీమ్మనఁగ ధూర్తు నొల్లబోడు
గీ. కులము జాతియు విద్యయు గొప్పఁదనము
వేషభాషలు గనఁడు గోవిందుఁ డండ్రు
నిన్నుఁ దెలిసిన మానులో నీలవర్ణ
విదిత పెద్దాపురీవాస! వేంకటేశ! 154

సీ. మొసలి నోటనుజిక్కి మునఁగజేంద్రుఁడు తొండ
మెత్తి యేడ్చుచు వేడ నెవఁడుబ్రోచె
చీర లీయఁగలేవె చెల్లెలికని యెంచి
యేడ్చు ద్రౌపదిమాన మెవఁడుగాచె
నెందుజూచిన శౌరి యందె గన్పడునంచు
నెదనమ్మ ప్రహ్లాదు నెవఁడు బెంచె
యమునలో దిగినట్టి యక్రూరునకు నీట
దయతోడ నెవఁడు ప్రత్యక్షమయ్యె
గీ. నెఱిఁగి భక్తులఁ బాలింప నెంతకైన
విష్ణుదేవుఁడె సులభుండు వేల్పులందు
ననుచు విబుధులు గుర్తింతు రవనియందు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 155
సీ. మునుగజేంద్రుని మొఱ్ఱవిని వచ్చె ననుకొన్నఁ
గువలయం బేడ వైకుంఠమేడ
వచ్చి ద్రౌపదికిఁ దా వలువలిచ్చె నటన్నఁ
దంతిపురం బేడ ద్వారకేడ
పిలుపుతోఁ బ్రహ్లాదుఁ బెంప వచ్చెనటన్న
స్తంభమేడ వికుంఠధామమేడ
కన్నార నక్రూరుఁ గాంచి వచ్చెనటన్న
నదియేడ వైకుంఠ నగరమేడ
గీ. శ్రితజనాభీష్ట సంధాయి శేషశాయి
యెందుఁజూచిన నందె లక్ష్మీశ్వరుండు
పరమభక్తుల వెన్నంటి తిరుగునండ్రు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 156

సీ. కావకుండునె నన్నుఁ గరుణానముద్రుఁడై
పృథుదరిత్రిఁ గుచేలు నేలువాఁడు
యేరకుండునె నన్ను నెంగిలే ఫలమిచ్చు
శబరినంతయుఁ బ్రేమ సాకువాఁడు
సాకకుండునె నన్ను సదయాంతరంగుఁడై
యడవిలో గుహుని మేలరయువాఁడు
అరయకుండునె నన్ను దురితవర్తను నజా
మిళుని స్వర్గమునందు నిలుపువాఁడు
గీ. ననుచు నమ్మితినయ్య నీయంఘ్రియుగము
పతితపావనశీల సద్భక్తలోల
యెఱిగి పాలింపకున్న నాకెవరుదిక్కు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 157

సీ. అణురూపుఁ డగుటచే ఫణిరాజతల్పుండు
బాహ్యదృష్టులకు జూపట్టఁ డేమొ
నిఖిలంబుఁ దానయై నిర్గుణుం డగుటచేఁ
బోల్పంగ బడఁడో వేల్పులకు వేల్పు
అప్రాకృతుం డౌట నణిమాదిరహితుఁడౌ
నరులచేతికి విష్ణు దొరకఁడేమొ
భక్తరక్షణకళాభారంబుతో నుండి
పలుమారు పిలచినఁ బలుకఁడేమొ
గీ. విశ్వమయుఁ డిందిరాభర్త విశ్వకర్త
ఆదిమధ్యాంతరహిత నారాయణుండు
లేనితావులు లేవంద్రు మౌనివరులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 158

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁ జాలు
మూర్తితో మోహనస్ఫూర్తితోడ
అసురసింధుర దర్పహర్యక్షమన నొప్పు
రూపుతోఁ గృపసేపు చూపుతోడ
రత్నాకరోత్తుంగ రంగత్తరంగస్వ
నంబుతో నభయదానంబుతోడ
సాంధ్యరాగకషాయ సాంద్రప్రభాజటా
భరముతో సిరిమీఁజు నురముతోడ

గీ. నెవ్వఁడు రహించు వైకుంఠ మెవనియిల్లు
గరుడవాహనుఁ డెవ్వఁడా పరమపురుషుఁ
డరయ నీవగదయ్య నన్గరుణఁజూడు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 159

సీ. భూరిలౌకిక మహాభోగంబు భోగమే
కఠినసంసార రోగంబుగాని
స్థూలదేహము జెందు తోషంబు తోషమే
చపలచైత్తిక దోషంబుగాని
భార్యాసుతాది సంపత్ప్రాప్తి ప్రాప్తియే
బహుపునర్భవదశావాప్తిగాని
సింహాసనాదిక శ్రీయంబు శ్రేయమే
యధికపాపసమన్వయంబుగాని

గీ. గాన నింద్రియ నివహంబుఁ గడలనీక
యనఘమతులెల్ల నీపాద మాశ్రయించి
నిస్తరింతురు భవవార్ధి నెమ్మితోడ
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 160

సీ. నిఖలభూతగణంబు నీవు సేయఁగలేవె
సృష్టికర్తనఁ గన్న శ్రీముకుంద
జగదేకవిలయంబుఁ దగ ఘటింపఁగ లేవె
చక్రంబు గొన్న త్రివిక్రమాంక
కార్యవిఘ్నము నీవు గావింపఁగా లేవె
బలిని భంగించిన జలజనాభ
కార్యరక్షణ సేయఁగా లేవె గాధేయు
జన్నంబుగాచిన జానకీశ
గీ. కర్తవును హర్తవును లోకభర్త వీవె
యెల్లజగములుఁ గల్ల నీవే నిజంబు
నిన్ను నమ్మినవారిదే నిత్యపదవి
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 161

సీ. బీజములోని వృక్షరాజిఁ బెంపఁగవచ్చు
బీజంబు లెవఁడు కల్పింపఁగలఁడు
మృత్తుచే కుంభంబు లొత్తి సేయఁగవచ్చు
మృత్తికానిర్మాణ మెవఁడు సేయు
హాటకంబున భూష లాచరింపఁగవచ్చు
బంగార మెవఁడు సేయంగనేర్చు
నీటిచేఁ బొలముఁ బండించి పోయఁగవచ్చు
నిల వాన గురిపింప నెవరితరము
గీ. యిట్టి పనులకు జగజెట్టి యీశ్వరుండె
మహిని దేవుఁడు లేఁడన్న మతములేదు
గార్యసిద్ధికి దైవంబె కారణంబు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ. 162

సీ. తొలిజన్మమున నెంత కలిమి నోమనివాఁడు
హరిభక్తిచేఁ గాంచు నధికధనము
గతభవంబున పుత్రగణము నోమనివాఁడు
హరిభక్తిచే గాంచు ననుఁగుసుతుల
తొలిబాము నందు తొయ్యలిని నోమనివాఁడు
హరిభక్తిచే గాంచు నబ్జముఖిని
గతజన్మమున సౌఖ్యగరిమ నోమనివాఁడు
హరిభక్తిచే గాంచు బరమసుఖము
గీ. ఆశ్రితపరాయణుండు నారాయణుండు
దైవభక్తులు కర్మబంధములు గాంచ
రనుచుఁ బల్కుదు రార్యులై నట్టి జనులు
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 163

సీ. అసురు లందకయుండ నమృతభాండము దాచి
శివివేల్పులకు నొడ్డించె నెద్ది
కళ్యాణవేళఁ జెంగల్వపూలకు వన్నె
వెట్టు శ్రీసతికేలు వట్టెనెద్ది
సోమకాసురుఁ గూల్చి సోమయాజులఁ బిల్చి
వేదముల్ మగుడ నర్పించెనెద్ది
సత్యభామామనస్సంతుష్టికై స్వర్గ
పారిజాతము నింటఁ బాతెనెద్ది
గీ. లోకకంటక జనకంఠ లుంఠనమున
భక్తులనుఁ బ్రోచు చక్రింబుఁ బట్టెనెద్ది
యట్టి నీకేలుఁదమ్మి మాకభయ మిమ్ము
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ ! 164

సీ. కాంచనోజ్జ్వలచేల ! కారుణ్యమయశీల
యఖిలకల్యాణ గుణాలవాల !
రక్షితామరగణాధ్యక్ష ! కౌస్తుభవక్ష !
కమలాయతాక్ష ! రాక్షసవిపక్ష !
పరమభక్తిజ్ఞాన పటునిశ్చలధ్యాన
ఘనజనప్రత్యక్ష ! కల్పవృక్ష !
సకలలోకస్వామి ! జంగమస్థావరాం
తర్యామి ! గరుడపతంగగామి !

గీ. చిన్మయానందసార ! లక్ష్మీవిహార !
పరమగుణసద్మ ! భవదీయపాదపద్మ
సేవకుండను ననుగావు దేవదేవ !
విదిత పెద్దాపురీవాస ! వేంకటేశ !



